# విదుర నీతి



సంపాదకులు

పురాణపండ రామమూర్తి.

ప్రకాశకులు

అధ్యాత్మ ప్రచారక సంఘం

భారత శాఖ — రాజమండ్రి.

ప్రథమ ముద్రణ,

భీష్మ ఏకాదశి 1961



వివరములకు

పి. రాధాకృష్ణమూర్తి.

అధ్యాత్మ ప్రచారక సంఘం

విక్రమహాలు — రాజమండ్రి.

శ్రీ భారద్వాజా,

రాజమండ్రి.

# కృతజ్ఞతాంజలి

## శ్రీ మార్గాని రామారావుగారు



మహాశయులారా !

సుమారు 3 సంవత్సరాలనుండి మా ప్రచార కార్యక్రమంలో సదా తమ సలహా సహకారాల నందజేస్తూన్న శ్రీ రామారావుగారికి భగవానుడు అచంచలమైన భక్తినీ ఆయురారోగ్యైశ్వర్యము లనూ యిచ్చి రక్షించుగాక ! — రచయిత.

సంజయుడు పాండవ శిబిరం నుండి తిరిగి వచ్చిన అనంతరం ధృతరాష్ట్రుడు వాని ముఖాన పాండవుల అభిమతం గ్రహించి వికలచిత్తుడైనాడు. ఆ క్షణంలోనే ద్వారపాలకుని పిలిచి తక్షణం వెళ్ళి విద్వాంసుడైన విదురుని తీసుకొనిరమ్మన్నాడు. ద్వారపాలకుడు అమాత్యమందిరానికి వెళ్ళి విదురుని వెంటబెట్టుకుని వచ్చాడు. సింహద్వారంలో విదురుడు నిలబడ్డాడు. పరిచారకుడు లోపలకుపోయి ఆ వార్త నివేదించాడు. ధృతరాష్ట్రుడు విదురుని లోపలకు ప్రవేశపెట్టమన్నాడు. రాజాజ్ఞానుసారం విదురుడు అంతఃపురంలో అడుగుపెట్టి- ప్రభూ! నేను విదురుడను, మీ అజ్ఞానుసారం మీ సముఖానికి వచ్చాను. ఇప్పుడు నేను చెయ్యవలసిన పనేమిటో ఆజ్ఞాపించగోరుతున్నాను- అని చేతులు దోయిలించాడు.

విదురా! ధీమంతుడైన సంజయుడు ఉపప్లావ్యంనుండి తిరిగివచ్చి నాకు విశేషాలన్నీ వివరించాడు. తూర్పు తెల్లవారుతుంటగా మన సభాభవనంలో సంజయుడు విషయాలన్నీ వివరిస్తాడు. నా మనస్సు ఎంతగానో వికలమవుతోంది. చింతాగ్నిలో వేగిపోతున్నాను. కంటిమీద రెప్ప వాలడం లేదు. ఈ రాజ్యంలో ధర్మార్ధవివేకం నీకంటె ఎవరికీ ఎక్కువ లేదు. కనక ఇప్పుడు నాకు శాంతిని కలిగించే మార్గమేదో చెప్పు. సంజయుడు రేపు సభలో వినిపించబోయే వారి సందేశం ఎలా ఉంటుందో తెలియడం లేదు. అదే నన్ను వేధిస్తోంది అని ధృతరాష్ట్రుడు విచారంతో ప్రశ్నించాడు.

ప్రభూ! బలవంతులతో విరోధం దుర్బలులకు ఉచితం కాదు. అటువంటివారికి రాత్రివేళ నిద్రపట్టదు. ఇతరులసంపదలను హరించినవారికీ, కాముకునికీ, చోరునికీ నిద్రరాదు. ఇటువంటిదోషాలు మీలో లేనప్పుడు మీ కెందుకు నిద్రరావటం లేదు? పరధనాన్ని మీరు ఆశించడం లేదుగదా?- అని విదురుడు ప్రశ్నించగా ధృతరాష్ట్రుడు- నేను నీముఖంనుండి ధర్మప్రవచనం కోరుతున్నాను- అన్నాడు.

ప్రభూ ! ఉత్తమలక్షణాన్వితుడైన ధర్మరాజు త్రిలోకాధీశుడు కాగలడు. అటువంటి వాడు మీా ఆజ్ఞలను సర్వదా శిరసావహించేవాడు. ఆ విషయం విస్మరించి మీారు వారిని అడవులకు పంపారు. మీారు ధర్మాత్ములూ, ధర్మజ్ఞులు. అయినా అంధులు కావడంవల్ల వానిని గుర్తింపలేక విపరీత మార్గాన ప్రవర్తిస్తూ వారి రాజ్యభాగంకూడా వారి కివ్వలేక పోతున్నారు. ధర్మజుడు సత్యపరాక్రముడు. ధర్మనిష్ఠుడు, మీాయందు గురుభావం కలవాడు. ఇన్ని సద్గుణాలు వానిలో ఉన్నాయి. కనుకనే ఎటు వంటి క్లేశాలైనా నిర్లిప్తంగా సహిస్తున్నాడు.

మీారు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని ప్రభృతి అయోగ్యులపై విశ్వాసముంచి రాజ్యభారం వారి కప్పగించి శాంతిని వాంఛింపడం వివేకం కాదు. సాత్విక స్వభావమూ ఉద్యోగయత్నమూ దుఃఖసహనమూ నిశ్చలధర్మస్థితీ కల పురుషుడు ఎన్నడూ వంచితుడు కాడు. వానినే విద్వాంసుడని మనీషు లంటారు. దుష్కర్మలకు దూరంగా ఉంటూ ఆస్తికబుద్ధితో, శ్రద్ధాసక్తులతో సత్కర్మలను అను ష్ఠింపడమే పండితలక్షణం. క్రోధము, లజ్జ, గర్వము

హర్షము, ఆత్మస్తుతి ఎవనిని వంచించవో వాడే విద్వాంసుడు. ప్రజలు ఎవనిసలహాలను గ్రహిస్తారో వాడే విద్వాంసుడు. ధర్మార్థా లనుసరిస్తూ లోకవ్యవహారం గ్రహిస్తూ భోగచింత లేక పురుషార్థాన్ని సాధిస్తూ శక్త్యనుసారం కృషిచేస్తూ విషయాలను స్వల్పకాలంలో గ్రహిస్తూ అప్రస్తుతప్రసంగాలు చెయ్యకుండా దుర్లభ వస్తువులను కోరకుండా పోయినవాటికోసం శోకించకుండా విపత్తులలో ధైర్యం పోగొట్టుకొనకుండా ఆరంభించిన కార్యాలను మధ్యలో ఆపకుండా సోమరియై కూర్చోకుండా మనస్సును వశపరచుకొని చరించువారు పండితులు. వారెప్పుడూ మంచిపనులే చేస్తారు. కృతజ్ఞులై చరిస్తారు. ఆదరిస్తే ఆనందమూ అనాదరిస్తే ఆగ్రహమూ పొందరు. గంభీరగంగాహ్రదసదృశహృదయంతో ఉంటారు. పదార్థాల యదార్థస్వరూపం వారికి తెలుస్తుంది. ఒకానొక కార్యం నిర్వహించడానికి ఉత్తమ సాధనాలు వారెరిగిఉంటారు. ఉపాయాలలో అపాయంలేని విధానాలు వారికి తెలుస్తాయి. వారి వాక్కుకు అవరోధముండదు. వారిప్రతిభ గ్రంథ విషయాలను అవలీలగా గ్రహిస్తుంది. తార్కికశక్తి

వారిసొమ్ము. వారిబుద్ధి విద్యను అనుసరిస్తుంది. వారి విద్య బుద్ధియొక్క అదుపులో ఉంటుంది. శిష్టాచారాలను వారు ఉల్లంఘించరు. విద్యావివేకం లేనిదే గర్వంతో చరించేవాడూ, దరిద్రుడై తీవ్ర మనోరథాలు కలవాడూ మూర్ఖులే. ఏ కృషీ చెయ్యకుండా సంపదలు వాంఛించేవాడూ స్వీయకార్యాలు విడిచి పరాచారాలు పాటించేవాడూ మిత్రులతో అసంబద్ధంగా చరించేవాడూ అయోగ్యాలను వాంఛించేవాడూ సఖులను తిరస్కరించేవాడూ బలవంతులతో వైరం పెంచుకొనేవాడూ శత్రువులతో మైత్రి సాగించి మిత్రకోటితో శాత్రవం నెరపేవాడూ సందేహ చిత్తుడై సర్వకార్యాలనూ సకాలంలో నిర్వర్తించనివాడూ మిత్రశూన్యుడూ పితృదేవతా కర్మలు నిర్వర్తించనివాడూ, అనాహూతుడై అగమించేవాడూ పృచ్ఛ లేకుండా భాషించేవాడూ కృతఘ్నులను విశ్వసించేవాడూ, దోషాచారపరాయణుడూ, పరదోషగ్రహణచిత్తుడూ, వ్యర్థక్రోధీ, అనధికారులకు ఉపదేశాలిచ్చేవాడూ, శూన్యాన్ని ఉపాసించేవాడూ, కృపణులను ఆశ్రయించేవాడూ వీరందరూ మూర్ఖులే.

విద్యాధనాలు విరివిగా ఉన్నా గర్వం లేకుండా చరించేవాడు పండితుడు. తనవల్ల పోషింపబడే వారికి భోజనభాజనాదులు సమకూర్చకుండా స్వోదర మాత్రపూరణం చేసుకొనేవాడు మహామూర్ఖుడు. మానవుడు ఒక్కడు చేసినపాపఫలం ఎందరినో వేధిస్తుంది. పాపఫలానుభవంతో అది వారిని విడిచి పెడుతుంది. కాని కర్త మాత్రం దోషిగానే ఉంటాడు. మహావీరుని హస్తంలోని ధనస్సునుండి వెలువడిన బాణం ప్రతిపక్షవీరులలోని ఎవరినీ వేధింపక పోవచ్చును. కాని విద్వాంసునివాక్కు సర్వప్రజా సమూహంతో రాష్ట్రాన్నికూడా నశింపచెయ్యగలదు. ఆత్మ బుద్ధితో కర్తవ్యాకర్తవ్యాలను నిశ్చయించుకొని శత్రు మిత్ర ఉదాసీనులను సామ దాన భేదదండోపాయాలతో వశపరచుకొని పంచేద్రియాలను జయించి సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ సమాశ్రయగుణాలను గ్రహించి స్త్రీ, ద్యూత, మృగయా వినోద, మద్యపాన, కటువచన కఠినదండ స్వభావ కర్కశ ప్రవర్తనాది అన్యాయాలను విడిచి సుఖించాలి.

(ఒకటి గొని రెంటి నిశ్చలయుక్తి జేర్చి. మూటి నాల్గింట కడువశ్యములుగ జేసి, ఏడింటిని గెల్చి యారింట నెఱిగి ఏడు, విడిచి వర్తించువాడు వివేక ధనుడు.)

త్రాగినవానినే విషం చంపుతుంది. బాణం గుచ్చుకొన్నవానినే యమసదనం చేరుస్తుంది. ప్రజలతో రాజును నశింపచెయ్యవచ్చు.

ప్రభూ! ఏకాకిగా ఆహారం భుజించకూడదు. తనకుతానై విషమసమస్యలలో నిశ్చయాలు చేసికో కూడదు. ఒంటరిగా ప్రయాణం చెయ్యకూడదు. అందరూ నిద్రిస్తూండగా ఒక్కడు మేల్కొని ఉండ కూడదు. ఇది విద్వాంసుల మార్గము. సాగరతరణానికి నౌక ఏకైకసాధన మైనట్లు స్వర్గం చేరడానికి సత్యమే ఏకైకసాధనం. ఈవిషయాన్ని మీరు గుర్తించడంలేదు. క్షమాశీలుడు ఒకేఒక దోషంతో ఉంటాడనిప్రజలు భావిస్తారు. వారిదృష్టిలో ఆదోషం అసమర్థత, క్షమను అసామర్థ్యంగా భావించకూడదు. క్షమకంటె బలమైనది లేదు. అసమర్థునికి క్షమ గుణమైతే సమర్థునికి అదే భూషణం. ఈ జగత్తులో క్షమను మించిన వశీకరణశక్తి లేదు. శాంతి అనే

ఖడ్గం ధరించినవానిని యేదుష్టుడూ యేమీ చెయ్య లేడు. తృణకాష్ఠాలు లేనిదే అగ్నివెలువడదు. క్షమా హీనుడు తనతో పాటు ఇతరులనుకూడా బాధకు గురి చేస్తాడు. ధర్మమే కళ్యాణపధము. ఓరిమియే శాంతి మార్గం. విద్యయే ఆనందహేతువు. ఈ భూమండ అంలో ఇద్దరే అధములు. కర్మను విడిచిపెట్టిన గృహస్థూ, కర్మబద్ధుడైన సన్యాసీ, శత్రువులను అలక్ష్యంచేసే ప్రభువునూ పరదేశాలు తిరుగని విప్రుని యీపృధివి కబళిస్తుంది. కటూక్తులు పలుక కుండా దుష్టులను ఆదరించకుండా చరించడంకంటె విశేషమైనపని ఏమీ లేదు. ఇతరులచేత కోరబడిన పురుషుని కామించే స్త్రీకీ, పరుల ఆశ్రయంలో ప్రవ ర్తించే పురుషుని ఆదరించే వ్యక్తికీ భేదంలేదు దరి ద్రుడై అమూల్యవస్తువులను అభిలషించేవాడూ, అస మర్థుడై క్రోధంతో ఉండేవాడూ తమకుతామే శత్రు వులు. శక్తికలిగి క్షమతో ఉండేవాడూ నిర్ధనుడైనా ఉన్నంతలో దానం చేసేవాడూ స్వర్గంలో ఉన్నత స్థానం పొందుతారు. న్యాయోపార్జితధనం రెండు విధాల దురుపయోగ మవుతుంది. సత్పాత్రునకు దానం చెయ్యకపోవడం అపాత్రునకు దానం ఇవ్వడం.

ధనికుడై దానం చెయ్యనివాడూ దరిద్రుడై కష్టాలు సహించలేనివాడూ ఉంటే వారిమెడకొక బండరాయి కట్టి మడుగులో పడేయాలి. సక్రమంగా సన్యాసం సాగించినవారూ, సంగ్రామరంగంలో శత్రుహస్తాలలో మరణించినవారూ సూర్యమండలాన్ని భేదించుకుని ఉత్తమలోకాలకు పోతారు.

ప్రభూ! కార్యసాధనకు ఉత్తమ మధ్యమ అధమ రీతులు మూడున్నాయి. ఈ మూడుదారులూ శ్రుతిప్రోక్తములే. వీటిని యథాప్రకారంగా ఆదరించేవారు సంపదల కధికారులవుతారు. దారా, పుత్ర, దాసులకు సంపదలపై అధికారంలేదు. ఈ ముగ్గురూ ఎవరి అధీనంలో ఉంటే వారి సంపదలు కూడా వారి అధీనంలో ఉంటాయి.

పరధనాపహరణా, పరనారీ సాంగత్యమూ సుహృజ్జనపరిత్యాగమూ అనే మూడుదోషాలూ మానవుని ధర్మాయుర్దాయ కీర్తులను క్షీణింప జేస్తాయి. కామ, క్రోధ, లోభాలు నరకానికి తెరచిన మూడుద్వారాలు.

వరప్రసాదమూ, రాజ్యప్రాప్తి, పుత్రోదయమూ అనే మూడూ ఏకకాలంలో ప్రాప్తించడం

కంటె శత్రువులు పెట్టే బాధలనుండి విముక్తిని పొం దడం ఘనమైనది. నేను నీవాడననీ సేవకుడననీ నీకు భక్తుడననీ అర్థించిన వారిని ఎటువంటి విప త్తులలోనూ విడిచిపెట్టకూడదు. అల్పబుద్ధినీ దీర్ఘ సూత్రునీ త్వరపడేవానినీ స్తోత్రపాఠకునీ రహస్య వమాలోచనలకు పిలువకూడదు. వీరిని విద్వజ్ఞ నులు గుర్తుపట్టగలరు. కుటుంబ వృద్ధజనులనూ, విపత్తులలో పడిన ఉన్నతకుటుంబీకులనూ దరిద్రు లైన మిత్రులనూ సంతాన విహీనయైన సోదరినీ ఆశ్రయమిచ్చి పోషించాలి.

ప్రభూ! ఇంద్రుని అభ్యర్థనంమీద బృహ స్పతి చెప్పిన విషయాలు కొన్నిచెబుతాను విను. దైవ సంకల్పమూ, ధీమంతులశక్తీ, విద్వాంసులయెడ వినయమూ, పాపవినాశనకర కార్యాచరణమూ అనే నాలుగూ మానవుని భయాన్ని దూరం చేస్తాయి. సక్రమంగా సాగించకపోతే అవే భయహేతువులు. అగ్నికార్యమూ, మౌనవ్రతమూ, శ్రద్ధాయుతమైన స్వాధ్యాయమూ, ఆదరదృష్టితో యజ్ఞానుష్ఠానమూ నడపాలి. తల్లితండ్రులనూ, అగ్నినీ, గురువునూ, ఆత్మనూ పంచాగ్నులుగా భావించి సేవించాలి. దేవ,

పితృ, సన్యాస, అతిథిమానవులను పూజించేవాడు కీర్తిశాలి అవుతాడు. మానవు డెక్కడకు పోయినా, మిత్రుడూ, శత్రువులూ, ఉదాసీనులూ' ఆశ్రయం పొందేవారూ, ఆశ్రయమిచ్చేవారూ వెంట ఉంటారు. ఈ జ్ఞానేంద్రియ పంచకంలో యే ఇంద్రియం దోష యుక్తమైనా దానినుండి బుద్ధి క్షీణిస్తూనే ఉంటుంది. సిరిసంపదలు కోరేవాడు నిద్రా భయ క్రోధ అలస దీర్ఘ సూత్ర తంత్రాదిదుర్గుణాలను విడిచిపెట్టాలి. అధ్యాపనంచెయ్యని గురువూ, మంత్రోచ్చారణలేని హోతా, రక్షణకు అసమర్థుడైన రాజూ, కటువుగా భాషించే భార్యా, గ్రామంలో వశించగోరే గొల్ల వాడూ, వనవాసం వాంఛించే మంగలీ పరిత్యాజ్యులు. సత్య, దాన, క్షమ, అనసూయ, కర్మపరతం త్రతాది సద్గుణాలను సావధానంతో అలవరుచు కోవాలి. ధనప్రాప్తి, ఆరోగ్యదేహమూ, అనుకూల వతీ ప్రియభాషిణీ అయిన అర్థాంగి, చెప్పుచేతలలో ఉండే కుమారుడూ ధనార్జన కుపయుక్తమైన విద్యా యీలోకంలో పరమసుఖదాయకాలు. కామ, క్రోధ. లోభ, మోహ, మద, మత్సరాది అరిషడ్వర్గాలను జయించి జితేంద్రియుడై చరించాలి. దొంగలు

ప్రమత్తులవల్ల, వైద్యులు రోగివల్ల, కామినీజనము కాముకులవల్ల, పురోహితులు యజమానునివల్ల, స్పర్థను వాంఛించే విద్వాంసుడు మూర్ఖునివల్ల జీవితం గడుపుతారు. సంరక్షణ లేకపోతే గోవూ, వ్యవసాయమూ, స్త్రీ, విద్యా నశిస్తాయి. ఉపస్థితుతతో చరించకపోతే మాద్యపఖ్యమూ, సేవా వినాశనానికి దారితీస్తాయి. విద్యపరిపూర్తి అయిన అనంతరం శిష్యుడు గురువునూ, వివాహానంతరం తల్లిని కుమారుడూ, భోగఫలానంతరం పురుషుడు స్త్రీనీ, పని జరిగినమీదట సహాకరించిన వారినీ. నదిని తరించాక నావనూ, రోగవిముక్త్యానంతరం వైద్యునీ, విస్మరించడం సహజం.

ఋణగ్రస్థుడు కాకపోవడం, ప్రవాసం ప్రాప్తించకపోవడం, సత్పురుష సాంగత్యం, కులవృత్తితో జీవికా నిర్వహణం అనేవే యీ లోకంలో సుఖాన్నిచ్చేవి. ఈర్ష్యాద్వేషాలతో అసంతోష క్రోధాలతో ఉన్ముక్షణశంకతో పరభాగ్యజీవికతో ఉండేవారు దుఃఖభాగులే. కామినీజనసాంగత్యాన్నీ, వేటనూ మద్యపానాన్నీ, జూదాన్నీ, పరుషప్రసంగాలనూ, ధనదుర్వినియోగాన్ని, కఠోరదండనీతినీ ప్రభువు

పరిత్యజించాలి, బ్రహ్మద్వేషమూ, బ్రాహ్మణ ధనాపహరణా, విప్రదండనా, వారిని నిందించడంలో సంతోషమూ, వారిప్రస్తుతిని ఆకర్ణించలేకపోవడమూ, యజ్ఞయాగాదులలో వారిని విస్మరించడమూ, అర్థించినప్పుడు విప్రకోటిపై దోషారోపణ చేయడమూ అనే దోషాలను ధీమంతులు దరిచేరనివ్వకూడదు. మిత్రసమాగమమూ, ధనప్రాప్తి, పుత్రాలింగనమూ, దారాసంగమమూ, కాలానుసారం ప్రియవచనాలాపమూ నిజప్రజల ఔన్నత్యమూ, అభీష్టవస్తుసిద్ధి, సంఘప్రతిష్ఠా అనేవి సంతోషకరాలు, లౌకిక సుఖాలకు ఇవే సాధనాలు. కులీనత, ఇంద్రియనిగ్రహము, పరాక్రమము, శాస్త్రజ్ఞానము, ధీశక్తి, మితభాషిత్వము, యథాశక్తి దానము, కృతజ్ఞత అనేవి కీర్తికి హేతువులు. నవద్వారాలతో త్రిస్తంభాలతో పంచసాక్షులతో ఆత్మకు ఆవాసస్థానమైన యీ దేహగృహంయొక్క తత్వం గ్రహించడంకంటె వేరే జ్ఞానం లేదు.

సావధానరహితుడూ, ఉన్మత్తుడూ, మద్యపాయి, అలసినవాడు, క్రోధి, క్షుధార్తుడు, తొందరపడేవాడు, లోభి, భయభీతుడు, కాముకుడూ, ధర్మ

తత్త్వం గ్రహించలేము. ఈ విషయమై ప్రహ్లాద సుధన్వుల గాథ ఒకటి ఉన్నది. కామక్రోధాలను విడిచి పాత్రులకు దానం చేస్తూ శాస్త్రజ్ఞానం తెలుసుకుంటూ కర్తవ్యాన్ని నిర్వహించే రాజుకు ప్రజలు వంగి నమస్కరిస్తారు. ప్రజలలో విశ్వాసం కలగ చేస్తూ అపరాధులను దండిస్తూ చరించే ప్రభువు సర్వసంపద సంపన్నుడౌతాడు. సావధానుడై దుర్బలులను అవమానించకుండా శత్రువులతో చతుర వ్యవహారం సాగిస్తూ బలవంతులతో సంగ్రామం సాగించక అవకాశానుసారం పరాక్రమం ప్రదర్శిస్తూ ఉండే ధీరుడు యెన్నివిపత్తులు వచ్చి మీద పడ్డా విచారసాగరంలో మునిగిపోకుండా వాటిని సహిస్తూ ప్రయత్నశీలుడై ఉంటే అవలీలగా శత్రువును జయించవచ్చు. వృధాగా విదేశాలలో తిరిగేవాడూ, పాపులతో మైత్రి చేసేవాడూ, పరస్త్రీగామీ, పాషండుడూ, చోరుడూ, కుటిలుడూ, మధుపానం చేసేవాడూ దుఃఖాలలో పడతారు. క్రోధమూ, తొందరపాటూ, పురుషార్ధరాహిత్యమూ, అనృతవాదిత్వమూ దుఃఖహేతువులు. మిత్రుల క్షేమంకోసం పోరాడనివాడూ, ఆదరించినవారిపై క్రోధం చూపే

వాడూ, వివేకహీనుడూ, పరదోషైకదృష్టి, దయా రహితుడూ, అధికప్రసంగి లోకంలో పేరుప్రఖ్యాతులు పొందలేరు. వేషపటాటోపం లేకుండా ఆత్మ ప్రశంస చేసుకోకుండా క్రోధం కలిగినా కటువుగా భాషించకుండా ఉండే మానవుడు సర్వజనాదరణీయుడవుతాడు. గర్వరహితుడూ, హైన్యం ప్రదర్శించనివాడూ, శాంతించిన వైరాన్ని ప్రకోపింపచెయ్యనివాడూ, ప్రమాదాలు మీదపడ్డా అనుచితాన్ని సహించనివాడూ, యితరుల దుఃఖానికి సంతోషించనివాడూ, దానంచేసి విచారించనివాడూ, సజ్జనశ్రేష్టులు, దేశవ్యవహారావసరాలూ జాతిధర్మాలూ తెలిసినవానికి ఉత్తమాధమవివేకం కలుగుతుంది. అటువంటి వివేకి జనసంఘంలో తన ప్రతిష్టను సంస్థాపించుకోగలడు. రాజద్రోహియై మోసదృష్టితో పాపకర్మలు చేసేవాడూ గర్వి, మత్సరుడూ మోహి, మత్తుడూ, ఉన్మత్తుడూ ఆదిగాగలవారితో వివాదానికి పోరాదు. దాన హోమ పూజా ప్రాయశ్చిత్తాది లౌకిక కర్మలను నిర్వహించేవాడు వృద్ధిలోకి వస్తాడు. సమానశీలురతో వివాహమూ, మైత్రీ, వ్యవహారమూ సాగించాలి. గుణసంపన్నులను ముందుంచుకొని

నడిచేవాడు నీతివిదుడు. ఆశ్రితులకు తృప్తిగా పెట్టి మితంగా భుజించాలి, అధిక కాలం కృషి చేసి తక్కువగా నిద్రిస్తూ అర్థులకు దానంచేస్తూ ఉండేవాడు అనర్థ దూరుడౌతాడు. స్వేచ్ఛానుసారం చరిస్తూ పరేచ్ఛను పరిగ్రహించకుండా తన ఆలోచనలను గుప్తంగా ఉంచుకుంటూ స్వీయకార్యాలను సక్రమంగా నిర్వహించుకోవాలి. సత్యవాదీ, కోమల స్వభావుడూ, ఉన్నతాభిప్రాయుడూ, ఆదరశీలీ, భూతశాంతికరుడూ అయినవాడు శ్రేష్ఠ రత్నంలా జాతివారిలో ప్రసిద్ధుడౌతాడు. లజ్జాశీలిని సర్వప్రజలూ గౌరవిస్తాయి. ఏకాగ్రచిత్తంతో శుద్ధహృదయంతో అనంతతేజస్సుతో ఆ పురుషుడు సూర్యునివలె భాసిస్తాడు.

పాండురాజు శాపదగ్ధుడైనా పాండవులైదుగురూ జన్మించారు. ఇంద్రసదృశులైన వారిని చిన్ననాటినుండి మీరే పెంచి పోషించి విద్యాబుద్ధులు నేర్పారు. వారు మీ ఆదేశాలను అంజలిఘటించి అనుసరిస్తున్నారు. ఈ నాడు వారి రాజ్యభాగం వారికిచ్చి మీబిడ్డలతో మీరు సుఖంగా ఉండండి. ఇలా చేసి

నట్లయితే దేవతలు సంతోషిస్తారు. ఈ ప్రజానీకం మిమ్మల్ని వేలెత్తి చూపదు అని విదురుడు ముగించాడు.

నా మనస్సులోని చింత నాకు నిద్రపట్టనివ్వడం లేదు. ఇప్పుడు నేను చెయ్యవలసిన పనేమిటో నిర్ణయించి చెప్పు. ధర్మార్థవిదుడవైన నువ్వు బాగా వివేచనం చేసి సత్యపథం నిర్దేశించు. కురుపాండవులకు ఏది హితమైనదో దానినే చెప్పు. నా హృదయం అనిష్టాలనే శంకిస్తోంది. కనుక నా కవే గోచరిస్తూ వేధిస్తున్నాయి. ధర్మరాజు ఏం కోరుతాడో ఆలోచించి చెప్పు — అని ధృతరాష్ట్రుడు ప్రశ్నించగా విదురుడు మహారాజా! ఎదుటివాని పతనాన్ని కోరకుండా చరించేవ్యక్తి అర్థించక పోయినా వానికి కళ్యాణమార్గమే చెప్పాలి. రానున్న విపత్తులు కూడా సూచించాలి. నేను కళ్యాణప్రదాలూ ధర్మయుక్తాలూ అయిన విషయాలు చెబుతాను వినండి. దుష్టమార్గాన కపటవ్యవహారాలు సాధించడం కోసం మీరు యత్నించకండి, సన్మార్గాన సదుపాయాలలో కృషిచేసినప్పుడు అది ఫలించక పోయినా ధీమంతుడు విచారించకూడదు, ప్రయో

జనంతో మనం కర్మ ప్రారంభిస్తున్నామో అది ముందుగా నిశ్చయించుకొని దాని విషయమై పూర్వా పరాలు చింతించి తొందరపడకుండా సావధాన చిత్తంతో దాని పరిణామాలనూ ఫలితాలనూ పరిశీలించి ముందడుగు వేయాలి. లాభమూ, హానీ, ధనమూ, దేశకాలస్థితులూ, దండనీతీ ఎరుగని రాజు రాజపదవికి అర్హుడుకాడు. పై విషయాలన్నీ గ్రహించి ధర్మార్థాలయందు సావధానచిత్తుడై చరించేవాడు రాజ్యార్హుడు. రాజపదవి లభించింది కదా అని అనుచితంగా వ్యవహరించకూడదు. వార్ధక్యం సౌందర్యాన్ని హరించేటట్లు ఉద్దండ వ్యవహారం సంపదలను నశింపచేస్తుంది. గాలము ముల్లుకు గ్రుచ్చబడిన ఆహారాన్ని వాంఛించే మీనం దాని పరిణామాన్ని ఆలోచించలేదు. పురుషుడు ఈ విషయం గ్రహించి తనకు ఆరోగ్యం కలిగించే వస్తువునే గ్రహించాలి. హితకరమైనదీ జీర్ణమయ్యేది ఆరగించాలేకాని పచ్చికాయలు కోసినట్లయితే దానివల్ల రసం సిద్ధించదు. అది వానికి ప్రయోజనకారి కాకపోగా దాని బీజంకూడా నశిస్తుంది. పక్వఫలాలు స్వీకరించడంవల్ల ఫలరసా

లతో పాటు బీజంకూడా నిలబడుతుంది. తుమ్మెద పువ్వులకు ప్రమాదం కలగకుండా మకరందం గ్రోలేటట్లు ప్రభువు ప్రజలకు హాని కలుగకుండా ధనం సంగ్రహించాలి. తోటమాలి చెట్టుకు ప్రమాదం రాకుండా పువ్వులు కోసేటట్లు ప్రభువు ప్రజల నుండి పన్నులు గ్రహించాలి.

ఒకానొక కార్యం చెయ్యబోయేముందు దాని వల్ల సిద్ధించే ప్రయోజన అప్రయోజనాలను ముందుగనే నిర్ణయించుకోవాలి. అసాధ్యాలకోసం కృషి చెయ్యడం అనవసరం అని తెలిసికూడా కృషిచేస్తే అది వ్యర్థమే కదా, అనవసరంగా క్రోధం కలిగే వానిని అకారణంగా సంతోషించే వానిని ప్రజలు రాజుగా గ్రహించరు. నపుంసకుని భర్తగా వరించే స్త్రీ ఎవరు ? స్వల్పకృషితో మహత్తరఫలాలనిచ్చే కార్యాలవైపే ధీమంతుడు తన బుద్ధిని మరల్చుతాడు. అనురాగహృదయంగల ప్రభువు ప్రజల ఆదరానికి పాత్రుడౌతాడు. ప్రభువు పుష్పితవృక్షం వలె ప్రసన్నుడై ఉండాలేగాని అధికఫలాల నందివ్వగూడదు. అల్పశక్తియుతుడైన ధీరునివలె గోచరించాలి. మనోవాక్కాయకర్మలతో ప్రజలకు నం

క్లేశం కలిగించే ప్రభువు ప్రఖ్యాతు డౌతాడు. భయంకరుడైన ప్రభువును ప్రజలు పరిత్యజిస్తారు. ప్రభంజనం కారుమేఘాలను ఛిన్నాభిన్నం చేసి నట్టు దుష్కర్మలు రాజ్యాన్ని పాడుచేస్తాయి. పరంపరాగతంగా సజ్జను లాచరించే మార్గాన నడిచే మహీపాలునికి సిరిసంపదలతో రాజ్యం వృద్ధిపొందుతుంది. ధర్మమార్గం విడిచి అధర్మంగా పోయే ప్రభువు ఏలుబడిలోని రాజ్యం నిప్పుమీాదపడ్డ చర్మంలా ముడుచుకుపోతుంది. పరరాజ్యసాధనార్థం చేసే ప్రయత్నాలతో బాటు స్వీయరాజ్య సంరక్షణానికి కూడా కృషి అవసరం. ధర్మంతోనే రాజ్యాన్ని సంరక్షించాలి. ధర్మబద్ధుడైన రాజును రాజ్యలక్ష్మి విడువదు. అధికప్రసంగులనుండీ ఉన్మత్తులనుండీ ప్రలాపకులనుండీ బాలురనుండీ సారవిషయాలు. శిలలనుండి బంగారం గ్రహించునట్లు గ్రహించాలి, శిలోంఛ వృత్తితో జీవితం సాగించేవానివలె ధీరులు భావపూర్ణశబ్దాలనూ, సూక్తులనూ, సత్కర్మలనూ గ్రహించాలి. వేదాలవల్ల విప్రులూ గంధంవల్ల గోవులూ గూఢచారులవల్ల రాజులూ నేత్రాలతో ప్రజలూ వాసనాలను గ్రహిస్తారు. [illegible]

క్లేశాలే పొందుతుంది. సాధువుగా నిలబడి పాలిచ్చే ఆవును ప్రజలు బాధించరు. మృదువైన లోహాన్ని అగ్ని తప్తం చెయ్యనక్కరలేదు. వంగేకర్రను వంచడానికి ప్రయత్నించేవాడుంటాడా? ఇది గ్రహించిన ధీమంతుడు బలిష్ఠులముందు తనే వంగుతాడు. అందువల్ల వానికి అవనతికాదు. పైగా ఆ లొంగుబాటు ఇంద్రునికి నమస్కరించడంవంటిది.

పశురక్షకుడు మేఘుడు. ప్రభుసహాయకుడు మంత్రి. స్త్రీకి ఆప్తుడు భర్త. బ్రాహ్మణులకు వేదాలే బంధువులు. సత్యంచేత ధర్మం రక్షింపబడుతుంది. విద్య యోగరక్షితము. సౌందర్యానికి శుభ్రత రక్షణాధారము. నీచకులజుడైనా సదాచారంవల్ల శ్రేష్ఠుడౌతాడు. పరధనాన్నీ రూపపరాక్రమ సౌభాగ్య సన్మానాలనూ ద్వేషించేవానిరోగం మందులతో కుదరదు. అకార్యాలాచరించడంవల్ల చేస్తున్నపనిలో ప్రమాదాలు కలుగచెయ్యడంవల్ల కార్యసిద్ధికి పూర్వమే ఆ రహస్యం ప్రకటించడంవల్ల భయంకర స్థితుగతు లేర్పడతాయి,

విద్యా ధన కుల మదాలుండకూడదు. ఈ మూడూ సజ్జనులకు దాంతిని కలిగిస్తాయి. ఉత్తములకు

తుంది. ధర్మమార్గం విడిచి అధర్మంగా పోయే ప్రభువు
ఏలుబడిలోని రాజ్యం నిప్పుమీదపడ్డ చర్మంలా
ముడుచుకుపోతుంది. పరరాజ్యసాధనార్థం చేసే
ప్రయత్నాలతోబాటు స్వీయరాజ్య సంరక్షణానికి
కూడా కృషి అవసరం. ధర్మంతోనే రాజ్యాన్ని సంర
క్షించాలి. ధర్మబద్ధుడైన రాజును రాజ్యలక్ష్మి విడు
దు. అధికప్రసంగులనుండీ ఉన్మత్తులనుండీ
ప్రలాపకులనుండీ బాలురనుండీ సారవిషయాలు.
లనుండిబంగారం గ్రహించునట్లు గ్రహించాలి,
ంఛ వృత్తితో జీవితం సాగించేవానివలె ధీరులు
వపూర్ణశబ్దాలనూ, సూక్తులనూ, సత్కర్మలనూ
హించాలి. వేదాలవల్ల విప్రులూ గంధంవల్ల
వులూ గూఢచారులవల్ల రాజులూ నేత్రాలతో
జలూ వాస్తవాలను గ్రహిస్తారు. పాడిచే ఆవు

క్లేశాలే పొందుతుంది. సాధువుగా నిలబడి పాలిచ్చే ఆవును ప్రజలు బాధించరు. మృదువైన లోహాన్ని అగ్ని తప్తంచెయ్యనక్కరలేదు. వంగేకర్రను వంచ డానికి ప్రయత్నించేవాడుంటాడా? ఇది గ్రహించిన ధీమంతుడు బలిష్టులముందు తనే వంగుతాడు. అందువల్ల వానికి అవనతికాదు. పైగా ఆ లొంగు బాటు ఇంద్రునికి నమస్కరించడంవంటిది.

పశురక్షకుడు మేఘుడు. ప్రభుసహాయకుడు మంత్రి. స్త్రీకి ఆప్తుడు భర్త. బ్రాహ్మణులకు వేదాలే బంధువులు. సత్యంచేత ధర్మం రక్షింపబడుతుంది. విద్య యోగరక్షితము. సౌందర్యానికి శుభ్రత రక్షణాధారము. నీచకులజుడైనా సదాచారంవల్ల శ్రేష్ఠు డౌతాడు. పరధనాన్ని రూపపరాక్రమ సౌభాగ్య సన్మానాలనూ ద్వేషించేవానిరోగం మందులతో కుద రదు. అకార్యాలాచరించడంవల్ల చేస్తున్నపనిలో ప్రమాదాలు కలుగచెయ్యడంవల్ల కార్యసిద్ధికి పూర్వమే ఆ రహస్యం ప్రకటించడంవల్ల భయం కర స్థితుగతు లేర్పడతాయి,

విద్యా ధన కుల మదాలుండకూడదు. ఈ మూ డూ సజ్జనులకు దాంతిని కలిగిస్తాయి. ఉత్తములకు

కోపం కలిగించే ప్రభువు ప్రఖ్యాతు డౌతాడు. భయంకరుడైన ప్రభువును ప్రజలు పరిత్యజిస్తారు. ప్రభంజనం కారుమేఘాలను ఛిన్నాభిన్నం చేసి నట్టు దుష్కర్మలు రాజ్యాన్ని పాడుచేస్తాయి. పరంపరాగతంగా సజ్జనులాచరించే మార్గాన నడిచే మహీపాలునికి సిరిసంపదలతో రాజ్యం వృద్ధిపొందుతుంది. ధర్మమార్గం విడిచి అధర్మంగా పోయే ప్రభువు ఏలుబడిలోని రాజ్యం నిప్పుమీదపడ్డ చర్మంలా ముడుచుకుపోతుంది. పరరాజ్యసాధనార్థం చేసే ప్రయత్నాలతో బాటు స్వీయరాజ్య సంరక్షణానికి కూడా కృషి అవసరం. ధర్మంతోనే రాజ్యాన్ని సంరక్షించాలి. ధర్మబద్ధుడైన రాజును రాజ్యలక్ష్మి విడువదు. అధికప్రసంగులనుండీ ఉన్మత్తులనుండీ ప్రలాపకులనుండీ బాలురనుండీ సారవిషయాలు. శిలలనుండిబంగారం గ్రహించునట్లు గ్రహించాలి, శిలోంఛ వృత్తితో జీవితం సాగించేవానివలె ధీరులు భావపూర్ణశబ్దాలనూ, సూక్తులనూ, సత్కర్మలనూ గ్రహించాలి. వేదాలవల్ల విప్రులూ గంధంవల్ల గోవులూ గూఢచారులవల్ల రాజులూ నేత్రాలతో ప్రజలూ వాస్తవాలను గ్రహిస్తారు. పాడిచే ఆవు

క్లేశాలే పొందుతుంది. సాధువుగా నిలబడి పాలిచ్చే ఆవును ప్రజలు బాధించరు. మృదువైన లోహాన్ని అగ్ని తప్తంచెయ్యనక్కరలేదు. వంగేకర్రను వంచడానికి ప్రయత్నించేవాడుంటాడా? ఇది గ్రహించిన ధీమంతుడు బలిష్టులముందు తనే వంగుతాడు. అందువల్ల వానికి అవనతికాదు. పైగా ఆ లొంగుబాటు ఇంద్రునికి నమస్కరించడంవంటిది.

పశురక్షకుడు మేఘుడు. ప్రభుసహాయకుడు మంత్రి. స్త్రీకి ఆప్తుడు భర్త. బ్రాహ్మణులకు వేదాలే బంధువులు. సత్యంచేత ధర్మం రక్షింపబడుతుంది. విద్య యోగరక్షితము. సౌందర్యానికి శుభ్రత రక్షణాధారము. నీచకులజుడైనా సదాచారంవల్ల శ్రేష్ఠుడౌతాడు. పరధనాన్నీ రూపపరాక్రమ సౌభాగ్య సన్మానాలనూ ద్వేషించేవానిరోగం మందులతో కుదరదు. అకార్యాలాచరించడంవల్ల చేస్తున్నపనిలో ప్రమాదాలు కలుగచెయ్యడంవల్ల కార్యసిద్ధికి పూర్వమే ఆ రహస్యం ప్రకటించడంవల్ల భయంకర స్థితుగతు లేర్పడతాయి,

విద్యా ధన కుల మదాలుండకూడదు. ఈ మూడూ సజ్జనులకు దాంతిని కలిగిస్తాయి. ఉత్తములకు

సహాయం చేసేవారు సత్పురుషులు. ఉన్నత వేష భాషలు సభనలరిస్తాయి. గోవు మధురరసాల నిస్తుంది. వాహకుడు మార్గాయాసం పొందడు. ఉత్తమశీల స్వభావాలుకలవాడు సర్వులనూ జయిస్తాడు. వ్యక్తికి ప్రధానమైన శీలం నశిస్తే వాని జీవితం వ్యర్థమే. ధనమదోన్మత్తుని ఆహారంలో మాంసమూ సామాన్యుని ఆహారంలో క్షీరరసమూ దరిద్రుని భోజనంలో తైలమూ అధికంగా ఉంటాయి. దరిద్రులకు ఆకలి యెక్కువ. ధనికుడికి జీర్ణశక్తి తక్కువ. దరిద్రుని ఉదరంలో కాష్టమైనా జీర్ణమవుతుంది. అధముడు జీవితానికీ, మధ్యముడు మృత్యువుకూ, ఉత్తముడు అవమానానికి భయపడతారు. ఐశ్వర్యం కలిగించే మదంకంటే సురాపానమదం అధికమైనదికాదు. ఐశ్వర్యమత్తుడు సంపదలు నశిస్తేకాని ఆ మత్తును వదలలేడు. సూర్యాది గ్రహ పరిభ్రమణవలయంలో ఉండని తారకలవలె అదుపులో లేని ఇంద్రియాలు కష్టభాజకాలే. జితేంద్రియుడు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధిపొందుతాడు. ఇంద్రియాలనూ మనస్సునూ జయించకుండా మంత్రులను స్వాధీనంలో ఉంచుకోగోరే

వాడూ మంత్రులను వశపరుచుకోకుండా శత్రువు
లను జయించగోరేవాడూ ప్రజాభిమానం పొంద
లేరు. మనశ్శత్రువును ముందు జయించాలి. మన
స్సును జయించి అపరాధులను శిక్షిస్తూ కార్యాలను
పరిశీలిస్తూ ఉండేవారిని లక్ష్మి వరిస్తుంది.

ఈ మానవశరీరమొక రథం. బాసక బుద్ధి
సారధి. ఇంద్రియాలు అశ్వాలు. వీనిని వశంలో
ఉంచుకొనేవాడు మహారథికునివలె సంసార సంగ్రా
మంలో జయం పొందుతాడు. అశిక్షితాలై పట్టుతప్పిన
గుఱ్ఱాలు మధ్యేమార్గంలో సారథిని పడగొట్టేట్టు.
వశంలోని ఇంద్రియాలు పురుషుని అర్థానర్థజ్ఞా
నాన్ని నశింపజేసి దుఃఖభాగుని జేస్తాయి. ధర్మా
ర్థాలను విడిచి విషయలోలుడై చరించేవాడు అచిర
కాలంలో ఐశ్వర్య ప్రాణ స్త్రీ ధనాలను పోగొట్టు
కుంటాడు. ఆత్మజ్ఞాని గ్రహించడానికి నిరంతరం
కృషి చెయ్యాలి. ఆత్మకు మంచిన మిత్రుడూ
శత్రువూ లేరు. దాన్ని జయించినవారికి అదే మిత్ర
ము. లేకపోతే అదే పరమశత్రువు. సూక్ష్మరంధ్రాలు
కల వలలోపడ్డ రెండు పెద్దచేపలు దానిని కొరికి
వేసేటట్టుకామక్రోధాలనే విూనాలు వివేకాన్ని నశింప
చేస్తాయి. ధర్మార్థాలను పరిశీలించుకొని విజయం

కోసం కృషిచేసేవాడు సులభంగా వానిని సాధి స్తాడు. చిత్తవికారానికి హేతుభూతాలైన పంచేద్రియాలను శత్రువులుగా భావించి వానిని జయిస్తేనే శత్రువిజయం సాధ్యమవుతుంది. సాధువులు సత్కర్మలవల్ల రాజు రాజ్యభోగాలవల్ల సుఖిస్తారు. పాపాత్ములతో సాంగత్యంగల సజ్జనులు కూడా దండనార్హులే అవుతారు. ఎండిన కట్టెతో కలిసే పచ్చికర్రకు కూడా అగ్నిబాధ తప్పదుకదా! అందుచేతనే దుర్జనసాంగత్యం ఉచితం కాదు. ఇంద్రియ లోలుని ఆ ఇంద్రియాలే ఆరగిస్తాయి. గుణగ్రహణమూ సరళ స్వభావమూ పవిత్రహృదయమూ సంతోషభావమూ మృదువచనమూ సత్యవ్రతమూ యింద్రియ సంయమనమూ దుష్టుల దరిజేరవు. ఆత్మజ్ఞానమూ క్రోధరాహిత్యమూ సహనశీలమూ వాగ్దానరక్షణా దానశీలమూ ధర్మపరాయణతా అధములకు పట్టవు. విద్వాంసులను నిందిస్తూ మూర్ఖులు సంతోషిస్తారు. ఎదుటవానిని నిందించడమే స్వభావంగా కలవాడు మహాపాపి. నిందలను సహిస్తూ వారిని క్షమించేవాడు పుణ్యాత్ముడు. హింస దుష్టులకు బలం, దండనీతి రాజులకు బలం, సేవ స్త్రీలకు బలం. క్షమ గుణశీలికి బలం.

వాక్కును స్వాధీనంలో ఉంచుకోవడంకంటె కష్టమైనది లేదు. చమత్కారయుక్తులతో విశేషార్థాలనుప్రతిపాదించగల వాణి మితంగానే ఉంటుంది. మధురశబ్దయుతమైన విషయం కళ్యాణప్రదమే అవుతుంది. అదేవిషయం కటువాక్కులతో నిండితే అనర్థదాయక మవుతుంది. గొడ్డలిదెబ్బలు తిన్న అరణ్యం చిగిరించవచ్చు. కాని కటువచనాలతో దెబ్బతిన్న హృదయం కోలుకోదు. శరీరంలో నాటిన తీక్ష్ణశరాలను పెరికి పారవెయ్యవచ్చు. కాని పరుషభాషణాలుమాత్రం గుండెలోనుండి పైకి తియ్యలేము. అందుచేతనే విద్వాంసులు కటువుగా భాషించరు. దేవతలు ఎవనికి పరాజయం కోరుతారో వాని బుద్ధినే ముందుగా హరిస్తారు. అంతతో వాడు దుష్కర్మరతు డవుతాడు. వినాశకాలం సమీపించినప్పుడే బుద్ధి నశిస్తుంది. అన్యాయం ప్రవేశిస్తుంది.

మహారాజా! నీ కొడుకులు పాండవులను విరోధదృష్టితో చూస్తున్నారని మరచిపోకు. సర్వసద్గుణసంపన్నుడైన ధర్మరాజు త్రిలోకాధీశుడు కాగలడు. ధర్మార్థవిదుడూ తేజస్సంపన్నుడూ ధీమంతుడూ

కోసం కృషిచేసేవాడు సులభంగా వానిని సాధిస్తాడు. చిత్తవికారానికి హేతుభూతాలైన పంచేద్రియాలను శత్రువులుగా భావించి వానిని జయిస్తేనే శత్రువిజయం సాధ్యమవుతుంది. సాధువులు సత్కర్మలవల్ల రాజు రాజ్యభోగాలవల్ల సుఖులౌతారు. పాపాత్ములతో సాంగత్యంగల సజ్జనులు కూడా దండనార్హులే అవుతారు. ఎండిన కట్టెతో కలిసే పచ్చికర్రకు కూడా అగ్నిబాధ తప్పదుకదా! అందుచేతనే దుర్జనసాంగత్యం ఉచితం కాదు. ఇంద్రియలోలుని ఆ యింద్రియాలే ఆరగిస్తాయి. గుణగ్రహణమూ సరళస్వభావమూ పవిత్రహృదయమూ సంతోషభావమూ మృదువచనమూ సత్యవ్రతమూ యింద్రియ సంయమనమూ దుష్టుల దరిజేరవు. ఆత్మజ్ఞానమూ క్రోధరాహిత్యమూ సహనశీలమూ వాగ్దానరక్షణా దానశీలమూ ధర్మపరాయణతా అధములకు పట్టవు. విద్వాంసులను నిందిస్తూ మూర్ఖులు సంతోషిస్తారు. ఎదుటవానిని నిందించడమే స్వభావంగా కలవాడు మహాపాపి. నిందలను సహిస్తూ వారిని క్షమించేవాడు పుణ్యాత్ముడు. హింస దుష్టులకు బలం, దండనీతి రాజులకు బలం, సేవ స్త్రీలకు బలం. క్షమ గుణశీలికి బలం.

వాక్కును స్వాధీనంలో ఉంచుకోవడంకంటే కష్టమైనది లేదు. చమత్కారయుక్తులతో విశేషార్థాలనుప్రతిపాదించగల వాణి మితంగానే ఉంటుంది. మధురశబ్దయుతమైన విషయం కళ్యాణప్రదమే అవుతుంది. అదేవిషయం కటూక్తులతో నిండితే అనర్థదాయక మవుతుంది. గొడ్డలిదెబ్బలు తిన్న అరణ్యం చిగిరించవచ్చు. కాని కటువచనాలతో దెబ్బతిన్న హృదయం కోలుకోదు. శరీరంలో నాటిన తీక్ష్ణశరాలను పెరికి పారవెయ్యవచ్చు. కాని పరుషభాషణాలుమాత్రం గుండెలోనుండి పైకి తియ్యలేము. అందుచేతనే విద్వాంసులు కటువుగా భాషించరు. దేవతలు ఎవనికి పరాజయం కోరుతారో వాని బుద్ధినే ముందుగా హరిస్తారు. అంతతో వాడు దుష్కర్మరతు డవుతాడు. వినాశకాలం సమీపించినప్పుడే బుద్ధి నశిస్తుంది. అన్యాయం ప్రవేశిస్తుంది.

మహారాజా! నీ కొడుకులు పాండవులను విరోధదృష్టితో చూస్తున్నారని మరచిపోకు. సర్వసద్గుణసంపన్నుడైన ధర్మరాజు త్రిలోకాధీశుడు కాగలడు. ధర్మార్థవిదుడూ తేజస్సంపన్నుడూ ధీమంతుడూ

కోసం కృషిచేసేవాడు సులభంగా వానిని సాధి
స్తాడు. చిత్తవికారానికి హేతుభూతాలైన పంచేంద్రి
యాలను శత్రువులుగా భావించి వానిని జయిస్తేనే
శత్రువిజయం సాధ్యమవుతుంది. సాధువులు
సత్కర్మలవల్ల రాజు రాజ్యభోగాలవల్ల సుఖి
స్తారు. పాపాత్ములతో సాంగత్యంగల సజ్జనులు
కూడా దండనార్హులే అవుతారు. ఎండిన కట్టెతో
కలిసే పచ్చికర్రకు కూడా అగ్నిబాధ తప్పదుకదా!
అందుచేతనే దుర్జనసాంగత్యం ఉచితం కాదు. ఇం
ద్రియ లోలుని ఆ ఇంద్రియాలే ఆరగిస్తాయి. గుణ
గ్రహణమూ సరళస్వభావమూ పవిత్రహృద
యమూ సంతోషభాషమూ మృదువచనమూ సత్య
వ్రతమూ ఇంద్రియ సంయమనమూ దుష్టుల
దరిజేరవు. ఆత్మజ్ఞానమూ క్రోధరాహిత్యమూ సహన
శీలమూ వాగ్దానరక్షణా దానశీలమూ ధర్మపరా
యణతా అధములకు పట్టవు. విద్వాంసులను నింది
స్తూ మూర్ఖులు సంతోషిస్తారు. ఎదుటవానిని నిందిం
చడమే స్వభావంగా కలవాడు మహాపాపి. నింద
లను సహిస్తూ వారిని క్షమించేవాడు పుణ్యాత్ముడు.
హింస దుష్టులకు బలం. దండనీతి రాజులకు బలం.
సేవ స్త్రీలకు బలం. క్షమ గుణశీలికి బలం.

వాక్కును స్వాధీనంలో ఉంచుకోవడంకంటే కష్టమైనది లేదు. చమత్కారయుక్తులతో విశేషార్థాలను ప్రతిపాదించగల వాణి మితంగానే ఉంటుంది. మధురశబ్దయుతమైన విషయం కళ్యాణప్రదమే అవుతుంది. అదేవిషయం కటూక్తులతో నిండితే అనర్థదాయక మవుతుంది. గొడ్డలిదెబ్బలు తిన్న అరణ్యం చిగిరించవచ్చు. కాని కటువచనాలతో దెబ్బతిన్న హృదయం కోలుకోదు. శరీరంలో నాటిన తీక్ష్ణశరాలను పెరికి పారవెయ్యవచ్చు. కాని పరుషభాషణాలుమాత్రం గుండెలోనుండి పైకి తియ్యలేము. అందుచేతనే విద్వాంసులు కటువుగా భాషించరు. దేవతలు ఎవనికి పరాజయం కోరుతారో వాని బుద్ధినే ముందుగా మారుస్తారు. అంతతో వాడు దుష్కర్మరతు డవుతాడు. వినాశకాలం సమీపించినప్పుడే బుద్ధి నశిస్తుంది. అన్యాయం ప్రవేశిస్తుంది.

మహారాజా! నీ కొడుకులు పాండవులను విరోధదృష్టితో చూస్తున్నారని మరచిపోకు. సర్వసద్గుణసంపన్నుడైన ధర్మరాజు త్రిలోకాధీశుడు కాగలడు. ధర్మార్థవిదుడూ తేజస్సంపన్నుడూ ధీమంతుడూ

భాగ్యశాలీ అయిన ధర్మజుడు మీయందు కల గౌరవ భావంచేత ఎన్ని కష్టాలైనా సహించాడు. అది మరువకండి — అన్నాడు విదురుడు.

ధీవిశాలుడైన విదురుడు ప్రసంగిస్తూంటే ధృతరాష్ట్రుని మనస్సు కొంతకొంత కలకదేరుతూంది. మరికొంత సేపు విదురుని ముఖాన నీతిశాస్త్రం వినాలని కుతూహలపడి ధృతరాష్ట్రుడర్థించాడు. ధీశాలి విదురుడు ప్రసంగిస్తున్నాడు.

ప్రభూ! సర్వతీర్థస్నానమూ, భూతదయా సమానమైనవి. ఒక్కొక్కప్పుడు తీర్థస్నానంకంటె మృదువ్యవహారమే ఘనమైనది. అందుచేత మీరు మీబిడ్డలైన దుర్యోధనాదులయందూ ధర్మరాజాదులయందూ సమభావంతో సౌమ్యంగా వ్యవహరిస్తే మీ కీర్తిప్రతిష్ఠలు యినుమడిస్తాయి. మానవుని కీర్తి యీభూమండలంలో ఎంతవరకూ గానం చెయ్యబడుతూంటుందో అంతవరకూ స్వర్గంలో స్థిరనివాసం లభిస్తుంది. ఈవిషయమై సుధన్వ విరోచనులమధ్య జరిగిన సంవాదమొకటి వినిపిస్తాను.

పూర్వకాలంలో 'కేశిని' అనే పేరుగల సౌందర్యరాశి ఉండేది. ఆమె సర్వోత్తముడైన వ్యక్తిని భర్తగా

వరించాలని స్వయంవరం ప్రకటించింది. ఆ స్వయం వరానికి కుతూహలంతో విరోచనుడు వచ్చాడు. అప్పుడామె వానితో— "విప్రా! దైత్యులలో శ్రేష్ఠు డెవడు? విప్రుడే శ్రేష్ఠుడైతే భూసురుడైన సుధ న్వుడు నా శయ్యను అలంకరించడానికి అర్హుడు కాడా? అని ప్రశ్నించింది. విరోచనుడు సమాధాన మిస్తూ— కేశినీ! ప్రజాపతి సంతానంలో మేము శ్రేష్ఠులము. మా ఎదుట దేవతలే అల్పులైనప్పుడు భూదేవతల విషయం చర్చకేరాదు— అన్నాడు.

విరోచనా! అయితేమనమిక్కడ యిలానే ఉండి సుధన్వుడు వచ్చేవరకూ నిరీక్షిద్దాం. వాని ఆగమ నానంతరం నిర్ణయించుకుందాం— అంది కేశిని. రాత్రిగడిచింది. తెల్లవారింది.

కేశినీ విరోచను లున్నచోటకు సుధన్వుడు వచ్చాడు. కేశిని లేచి నిలబడి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆసనం చూపింది. అప్పుడు సుధన్వుడు విరోచనుని వైపు తిరిగి— ప్రహ్లాదనందనా! నేను యీ సుందర స్వర్ణసింహాసనాన్ని మర్యాదగా స్పృశిస్తున్నాను. అంతే నేను దీనిపై కూర్చోను. ఈ ఆసనాన్ని నేను అలంకరించినట్లయితే నీతో సమానుడనే అవుతాను.

అనగా విరోచనుడు— ఓ బ్రాహ్మణుడా! దర్భాసనమూ, దారుపీఠమూ యోగ్యమైనవికాని స్వర్ణ సింహాసనాలు నీ కర్హమైనవి కావు- అన్నాడు.

విరోచనా! తండ్రీకొడుకులు ఒకే ఆసనంమీద ఆసీనులు కావచ్చు. ఇద్దరు విప్రులూ, ఇద్దరు క్షత్రియులూ, ఇద్దరే వైశ్యులూ, శూద్రులూ ఇద్దరు వృద్ధులూ. ఏకాసనాసీనులుకావచ్చు. అంతే. నీ తండ్రియైన ప్రహ్లాదుడుకూడా నాకు ఉన్నతాసనమిచ్చి గౌరవంగానే చూస్తాడు. నువ్వు పసివాడవు. సుకుమారంగా పెరుగుతున్న నీకు లౌకికజ్ఞానం పట్టలేదు. అని సుధన్వుడనగా విరోచనుడు- సుధన్వా! మా దైత్యనగరంలో ఉండే ధనకాంచనాలనూ గోవులనూ అశ్వాలనూ పణంగా పెడుతున్నాను. మనయిద్దరిలో ఎవడు శ్రేష్ఠుడో నిర్ణయించుకుందాం - అనగా సుధన్వుడు - ప్రహ్లాదనందనా! అవన్నీ అలానే వుంచు. మనము మన ప్రాణాలను ఒడ్డి ఈ విషయం నిర్ణయించుకుందాం. ఈ నిర్ణయం ఒక జ్ఞానివల్ల జరగాలి - అన్నాడు. విరోచనుడందు కంగీకరిస్తూ - బ్రాహ్మణా! నేను దేవతలదగ్గరకు పోను. ఈ విషయమై మానవుల నిర్ణయం నాకు

పొసగదు— అనగా సుధన్వుడు— ఓ దైత్యా! మనము నీతండ్రియైన ప్రహ్లాదుని దగ్గరకు పోయి ఈ విషయమై నిర్ణయం చెయ్యామందాము. ప్రహ్లాదుడు ఏస్థితిలోనూ అబద్ధమాడడని నా నమ్మకము— అన్నాడు.

వారుభయులూ బయలుదేరి ప్రహ్లాదుని సమీపించారు. ఎన్నడూ కలియని విరోచన సుధన్వులు కుపితభుజంగాలవలె రావడం చూసి ప్రహ్లాదుడు నాయనా! సుధన్వునికీ నీకూ సఖ్యంకలిగిందా? ఇదివరలో ఎన్నడూ కలిసి మెలసి తిరుగని మీరు ఈనాడు ఇలా రావడం ఆశ్చర్యంగా ఉంది— అనగా విరోచనుడు సమాధాన మిస్తున్నాడు.

మహారాజా! మా ఉభయులమధ్యా మైత్రిలేదు. ఒకవిషయమై పోటీపడి ప్రాణాలుఒడ్డి నీదగ్గరకు వచ్చాము. ఇప్పుడు యదార్థంచెప్పండి— అన్నాడు.

ప్రహ్లాదుడు సేవకులను పిలిచి సుధన్వునికి అర్ఘ్యపాద్యాలూ మధుపర్కాలూ తెప్పించి— అర్పించి బ్రాహ్మణోత్తమా! నీవు అతిథివి. నాకు పూజనీయుడవు. నీకు దానమివ్వడానికి తెల్లని ఆవులను సిద్ధంగా ఉంచాను— అనగా సుధన్వుడు ప్రహ్లాదా! నా

కివన్నీ దారిలోనే లభించాయి. ఇప్పుడు నువ్వు నా ప్రశ్నకు సమాధానమివ్వాలి. విప్ర, దైత్యులలో శ్రేష్ఠు డెవడు?- అని ప్రశ్నించాడు.

భూసురోత్తమా ! నాకు విరోచను డొక్కడే కొడుకు. నువ్వో స్వయంగా ఇక్కడకు వచ్చి ఈ వివాదం నా ముందుంచితే నేనెలా నిర్ణయించగలను అని ప్రహ్లాదుడు ప్రశ్నించగా— మహారాజా! నీ ధన ధాన్యసంపదలన్నీ నీ కుమారునకే ఇయ్యి. కాని ఈ వివాదంలోమాత్రం సత్య నిర్ణయంచెయ్యి- అని అడుగగా ప్రహ్లాదుడు- సుధన్వా! సత్యం భాషించ కుండా అసత్యాన్ని పలికే వక్తకు కలిగే స్థితి ఏమిటో నాకు చెప్పు— అన్నాడు.

సవతులుగల స్త్రీకీ ద్యూతంలో ఓడిన జూద రికీ భారవాహకుడికీ రాత్రివేళల ఏస్థితి కలుగుతుందో అన్యాయపు నిర్ణయాలు చేసేవారికీ అదేస్థితి కలుగు తుంది. అసత్యనిర్ణయం చేసే రాజు బంధితుడై క్షుద్బాధ ననుభవిస్తూ శత్రువులసంతోషం చూడ వలసిన స్థితిలో పడతాడు. గోవుకొరకు, పశువు కొరకు, అశ్వముకొరకు, మనుష్యునికొరకు అనృత మాడేవాడు క్రమంగా ఐదు, పది, నూరు, వేయి

తరాలవరకూ నరకంలో ఉంటాడు. స్వర్ణంకోసం అసత్యం పలికేవాడు భూతభవిష్యత్ఫలాలను కోల్పోతాడు. భూమికోసం స్త్రీకోసం అనృతమాడే వాడు సర్వనాశనం చేసుకుంటాడు— అని సుధన్వుడు చెప్పగా ప్రహ్లాదుడు తన కుమారునివైపు తిరిగి— నాయనా! సుధన్వుని తండ్రియైన అంగిరసుడు నాకంటె శ్రేష్ఠుడు. వీనితల్లి నీతల్లికంటె శ్రేష్ఠురాలు. అందుచేత నువ్వు సుధన్వునికంటె గొప్పవాడవుకావు. ఇప్పుడు నువ్వు సుధన్వుని చేతులలో ఉన్నావు— అని పలికి సుధన్వునివైపు తిరిగి- బ్రాహ్మణదేవతా! నువ్వనుగ్రహిస్తే నా కుమారుడు నాకు దక్కుతాడు— అన్నాడు.

ప్రహ్లాదా! నువ్వు ధర్మాన్నిస్వీకరించి సత్యాం భాషించావు. కనక నీ కుమారుని నీ కిస్తున్నాను. కాని వీడు కేశినిసమక్షంలో నా కాళ్ళు కడగాలి అన్నాడు అని విదురుడు ఆ గాధను ముగించి—

మహారాజా! ఈ ఉపాఖ్యానం విన్నారుకదా! అందుచేత మీరు మీ కుమారులకోసం స్వార్థవశీభూతహృదయంతో అసత్యమాడకండి. అసత్యమాడి సర్వనాశనానికి దారి తియ్యకండి. గోపాలకు

లవల అందరినీ దేవతలు అనుక్షణం రక్షిస్తూ ఉండరు, వా రెవరిని రక్షించగోరుతారో వారిని సక్రమమార్గాన నడుపుతారంతే. మానవుడు తన మనస్సును కళ్యాణమార్గాన నడిపితే వాని అభీష్టాలు సిద్ధిస్తాయి. కపటవ్యవహారం మాయోపాయం పాపహేతువులే అవుతాయి. రెక్కలు రాగానే పక్షులు గూళ్ళు విడిచేటట్లు అంతిమకాలంలో వేదాలు కూడా మనిషిని విడుస్తాయి. సురాపానమూ, కలహమూ, భార్యాభర్తల మధ్య ద్వేషాలు పెంచడమూ, సాంఘిక వైరమూ, కుటుంబజనులలో విభేదాలు పెంచటమూ, స్త్రీ పురుషులమధ్య వివాదమూ, రాజుతో వైరమూ ఉచితంకాదు. సాముద్రికుడూ చోరుడై వ్యాపారంచేసేవాడూ జూదరీ వైద్యుడూ శత్రువూ మిత్రుడూ నటకుడూ సాక్షులుగా పనికి రారు. స్వాధ్యాయమూ మౌనమూ అగ్నిహోత్రమూ యాగానుష్ఠానమూ భయవిదూరకాలు. ఇళ్ళకు నిప్పుపెట్టేవాడూ, విషం త్రాగించేవాడూ, జారులవల్ల కలిగిన సంతానధనం తినేవాడూ, సోమరసం విక్రయించేవాడూ, శస్త్రాలు నిర్మించేవాడూ, మోసగాడూ, మిత్రద్రోహీ, పరస్త్రీ లంప

లవల అందరినీ దేవతలు అనుక్షణం రక్షిస్తూ ఉండరు, వా రెవరిని రక్షించగోరుతారో వారిని సక్రమమార్గాన నడుపుతారంతే. మానవుడు తన మనస్సును కళ్యాణమార్గాన నడిపితే వాని అభీష్టాలు సిద్ధిస్తాయి. కపటవ్యవహారం మాయోపాయం పాపహేతువులే అవుతాయి. రెక్కలు రాగానే పక్షులు గూళ్ళు విడిచేటట్లు అంతిమకాలంలో వేదాలు కూడా మనిషిని విడుస్తాయి. సురాపానమూ, కలహమూ, భార్యాభర్తలమధ్య ద్వేషాలు పెంచడమూ, సాంఘికవైరమూ, కుటుంబజనులలో విభేదాలు పెంచటమూ, స్త్రీ పురుషులమధ్య వివాదమూ, రాజుతో వైరమూ ఉచితంకాదు. సాముద్రికుడూ చోరుడై వ్యాపారంచేసేవాడూ జూదరీ వైద్యుడూ శత్రువూ మిత్రుడూ నటకుడూ సాక్షులుగా పనికిరారు. స్వాధ్యాయమూ మౌనమూ అగ్నిహోత్రమూ యాగానుష్ఠానమూ భయవిదూరకాలు. ఇళ్ళకు నిప్పుపెట్టేవాడూ, విషం త్రాగించేవాడూ, జారులవల్ల కలిగిన సంతానధనం తినేవాడూ, సోమరసం విక్రయించేవాడూ, శస్త్రాలు నిర్మించేవాడూ, మోసగాడూ, మిత్రద్రోహీ, పరస్త్రీ లంప

రుష సాంగత్యంవల్ల యీ గుణసంపదలు లభి స్తాయి. తపో, యజ్ఞ, దానాధ్యయనాదులు సజ్జన సాంగత్యంవల్లనే కలుగుతాయి. సజ్జనులు సత్య వ్రతంతో మృదుస్వభావంతో కోమలహృదయులై ఇంద్రియనిగ్రహంతో చరిస్తారు. దంభాచారి తపో, దాన, యజ్ఞాధ్యయనాలను భేషజానికి సేవిస్తాడు. దయ, క్షమ, నిర్లోభము, సత్యము ఉత్తము లనుష్ఠిస్తారు.

ప్రభూ! వృద్ధులూ గురువులూ లేనిది సభ కాదు. ధర్మం చెప్పలేనివాడు గురువూ వృద్ధుడూ కాడు. సత్యబద్ధంకానిది ధర్మంకాదు. కపటమైనది సత్యంకాదు. సత్య, వినయ, శాస్త్రజ్ఞాన, కులీన శీల, బల, ధన, శూరత్వ, విద్యా మృదుభాషిత్వాలు స్వర్గహేతువులు. నిందితు డెప్పుడూ పాపకర్మలే చేస్తూ తత్ఫలమే పొందుతాడు. పుణ్యాత్ముడు సత్కర్మలే చేస్తూ స్వర్గంచేరతాడు. పాపకర్మలు బుద్ధిని నశింపచేస్తాయి. బుద్ధిశూన్యుడు పాపాచార పరాయణుడే అవుతాడు. అందుచేత ధీమంతుడు సత్కర్మలే ఆచరిస్తూ ఏకాగ్రచిత్తుడై పుణ్యకర్మ రతు డౌతాడు. సద్గుణాలను దోషంగా భావించే

వాడూ, మర్మస్థానాలను వేధించేవాడూ. దయార్ర
హితుడూ, క్రూరుడూ, శఠుడూ కష్టభాజనులవుతారు.
ధీమంతుడే పండితుడు. ధర్మార్థాలు వానినే పొందు
తాయి. పగలంతా పనిచేసినవాడు రాత్రి సుఖంగా
నిద్రపోగలడు. ఎనిమిదిమాసాలూ కష్టపడినవాడు
వర్షాకాలం నాలుగునెలలూ సుఖిస్తాడు. వృద్ధాప్యం
వచ్చేలోగా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. పచన
మైన అన్నాన్నీ యౌవ్వనవతి యైనస్త్రీనీ విజేతయైన
శూరునీ సంసారసాగరం తరించిన తపస్వినీ ధీరులు
గ్రహిస్తారు. అధర్మదోషంవల్ల లభించే సంపదులు
నిలబడవు. మరికొన్ని దోషాలుకూడా దాన్ని చేరు
తాయి. ఇంద్రియాలను వశపరచుకుని శాసించగల
వాడే గురువు. దుష్టులను దండించగలవాడే రాజు.
చాటుమాటున పాపాలను చేసినవారిని శిక్షించేవాడే
యముడు. ఋషుల, నదుల, మహాత్ముల, స్త్రీ
దుశ్చరిత్రల ఉత్పత్తిస్థానాలు మనకు తెలియవు.
బ్రాహ్మణసేవానిరతుడూ, దానశీలుడూ, మృదు
స్వభావుడూ, శీలాచారసపంన్నుడూ అయిన ప్రభువు
చిరకాలం పృధివిని పాలిస్తాడు. విద్వాంసుడూ
శూరుడూ, సేవాధర్మవిదుడూ అయిన వ్యక్తి పృధ్వి

లతనుండి సువర్ణపుష్పం గ్రహించగలడు. ధీశక్తితో చేసే కర్మ శ్రేష్ఠమైనది. బాహుబలంతో జరిగేకర్మ మధ్యమమైనది. జఘనకర్మలు అధమాలు. భార వాహకర్మ అధమాధమము.

ప్రభూ! మీరు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ శకుని ప్రభృతులపై రాజ్యభార ముంచి ఉన్నతిని శాంతినీ కోరుతున్నారు. గుణసంపన్నులైన పాండవులపై ద్వేషభావం విడిచి పుత్రవాత్సల్యంతో చరించడమే మీకు ఉచితమైన మార్గం—అన్నాడు విదురుడు.

మహారాజా! ఈ విషయంలో ప్రాచీనమైన ఇతిహాసం ఒకటి ఉన్నది. అది దత్తాత్రేయు సాధ్య దేవత సంవాదరూపంగా చెబుతారు. అది వినండి

దత్తాత్రేయమహర్షి ఉత్తమవ్రతంతో పరమ హంసరూపంలో విహరిస్తున్నాడు. అప్పుడు సాధ్య దేవతలు వానిని సమీపించి తమను పరిచయం చేసుకుని— మహర్షీ! మేము మిమ్ము శాస్త్రజ్ఞాను లుగా ధీమంతులుగా భావిస్తున్నాము. మాకు ఈ సంపూర్ణశక్తియుతమైన సందేశం వినిపించండి-అని అర్థించారు.

సాత్యులారా! మనోనిగ్రహమూ, సత్యపరాయణత్వమూ, ధర్మపాలననిరతీ, జీవితాని కవశ్యమైనవని నేను విన్నాను. ధైర్యంతో పురుషుడు హృదయ కవాటం తెరచి ప్రియాప్రియాలను సమదృష్టితో చూడగలగాలి. ఇతరులు నిందించినా తిరిగి నిందించకూడదు. అందువల్ల ఎదుటివాని క్రోధం వానినే హరిస్తుంది ఆ క్రోధం వారి పుణ్యాన్ని కూడా నశింపచేస్తుంది. పరులను అవమానించరాదు. దురాచారికారాదు. దురభిమానము ఉండకూడదు. మిత్రద్రోహము, నీచసంసేవనము ఉచితమైనవికావు. వ్యర్థక్రోధంతో పరుషంగా భాషించకూడదు. కటు వచనాలు మర్మస్థానాలను వేధిస్తాయి. అందుచేత ఎప్పుడూ పరుషంగా మాట్లాడకూడదు. పరుషంగా భాషిస్తూ పరులను పీడించేవానికంటె దరిద్రుడు లేడు. నిరంతరం దుర్భాషలాడుతూ జీవించేవాని ముఖంలోనే దరిద్రమూ మృత్యువూ నివశిస్తాయి. మనసుగురించి ఎవరైనా పరుషంగా భాషిస్తూంటే అకారణంగా మననునిందిస్తూంటే వాడు మన పుణ్యఫలాన్ని పెంపొందిస్తున్నాడని సంతోషించాలి. వస్త్రం ఏరంగునీటిలో ముంచబడితే అది ఆ రంగునే

పొందుతుంది. అదేవిధంగా సజ్జనుడైనవానిని దుర్జనుడు సేవించి సజ్జనుడౌతాడు. మహాతపస్వియై చోరునీ మూర్ఖునీ సేవిస్తే ఆ తపస్వికూడా మూర్ఖుడూ చోరుడూ అవకతప్పదు. పరిసరాలూ పరిజనులూ తమ ప్రభావాన్ని ప్రసరిస్తూనే ఉంటారు.

ఇతరుల విషయంలో పరుష ప్రసంగాలు చెయ్యనివాడు చేయించనివాడు ఇతరులచేత అవమానితుడైకూడా ప్రతీకారాన్ని తలపెట్టనివాడూ ఏ అవమానమూ పొందకుండా ఇతరులపై ప్రతీకార చర్యలకు సాహసించనివాడూ స్వర్గానికి వస్తున్నప్పుడు దేవతలు వానికి స్వాగతం పలుకుతారు. మౌనం భాషణంకంటె ఉత్తమమైనది. సత్యవాక్పాలనం మౌనంకంటె లాభప్రదమైనది. ప్రియభాషణం ద్వితీయస్థానమే ఆక్రమిస్తుంది. సత్యంతోపాటు అది ప్రియంగా ఉంటే ధర్మసమ్మతం కూడా అయితే ఆ వాక్కు సర్వవిధాలా ఉత్తమమైనది.

మానవుడు తాను ఎవరిని సేవిస్తాడో ఏపరిసరాలలో మెలుగుతూంటాడో ఎటువంటి పరిణామం వాంఛిస్తాడో అది పొందుతాడు. ఏవిషయాలు మన

స్సునుండి తొలగించాలనుకుంటాడో వాటినుండి విముక్తి పొందుతాడు. ఇందువల్ల వానికి దుఃఖం లేదు. ఒకరిని జయించాలని కాని బాధించాలని కాని ఎవడు భావించడో ఒకరిని నిందించడానికి ప్రశంసించడానికి ఎవడు ప్రయత్నించడో వాడు విచారసంతోషాలకు దూరంగా ఉంటాడు. అందరి సౌఖ్యాన్ని కోరేవాడూ ఎవరికీ అనిష్టం జరగాలని తలంచనివాడూ సర్వకాలాలయందు సత్యమే పలికే వాడూ జితేంద్రియుడూ, కోమలస్వభావుడూ, ఉత్తమ పురుషుడు. వాగ్దానంచేసి తదనుసారం ప్రవర్తించేవాడూ నిష్కల్మషంగా సానుభూతిని ప్రదర్శించేవాడూ ఇతరులదోషాల నెరిగినవాడూ మధ్యముడు. కఠోరశాసనాలతో క్రోధవశుడై సర్వజనులకూ అపకారం తలపెడుతూ, మిత్ర రహితుడై కళంకజీవితం గడిపేవాడు అధముడు. తనను తనే శంకించుకుంటూ ఇతరుల వల్ల ఏప్రయోజనము జరగదని నిశ్చయించుకొని స్నేహితులకు దూరంగా ఉండేవాడు అధమాధముడు. మన ఐశ్వర్యం వృద్ధిపొందాలంటే ఉత్తమ పురుషులతో సాంగత్యం కావాలి. అవసరానుసారం

అధమజన సంసేవనంకూడా అవసరమే. కాని ఈ అధమపురుషులతో అధికకాలం ఉండరాదు.

మానవుడు దుర్జనసాంగత్యబలంవల్ల నిరంతర ప్రయత్నంవల్ల పురుషార్థప్రయోగంతో ధనార్జన చెయ్యవచ్చు. కాని తన్మూలంగా వాడు ఉత్తమ పురుషులవల్ల సన్మానం పొందలేడు.

ధృతరాష్ట్రుడు:— ధర్మార్థాలను అనుష్ఠించే దేవతలుకూడా ఉత్తమకులంలో జన్మించిన పురుషులనే సమ్మానిస్తారు. ఈ మహాకులీను లనగా ఎవరు?

విదురుడు:— ప్రభూ! జితేంద్రియుడై యజ్ఞము తపస్సు అన్నదానము సదాచారంతో సాగిస్తూ మనస్సును వశంలో ఉంచుకొని వివాహబంధాన్ని పవిత్రంగా నడిపేవాడు ఉత్తమకులీనుడు. భ్రష్టం కాని సదాచారాలతో తల్లిదండ్రులకు ఏమాత్రం నష్టం కలగకుండా ప్రసన్నచిత్తంతో ధర్మాచారపరాయణుడై అనృతమాడకుండా వంశాభ్యుదయాన్ని కోరేవాడు మహాకులీనుడు. యజ్ఞకర్మ నిర్వర్తించకపోయినా ... దోషభూయిష్ట వంశంనుండి కన్యను పరిగ్రహించినా వేదాన్ని త్యజించినా

ధర్మాన్ని ఉల్లంఘించినా అధమకులమే ప్రాప్తి స్తుంది. దేవ బ్రాహ్మణ మాన్యాలు హరించినా విప్ర మర్యాదలు ఉల్లంఘించినా సుకులీనుడు అధము డౌతాడు. విప్రులను అనాదరించినా అందరినీ నిందిం చినా దాచబెట్టిన వస్తువులను దొంగిలించినా పై స్థితియే మానవునకు కలుగుతుంది. గో ధన, జన, సంపత్తులున్నా సదాచారం లేకపోతే వాడు మహా కులీనుడు కాడు. ఆచారసంపత్తి సక్రమంగా సాగితే కులీనత సిద్ధిస్తుంది. అందుచేతనే సదాచా రాలను ప్రయత్న పూర్వకంగా రక్షించుకోవాలి. ఈ సంపదలున్నవే యివి వస్తూ పోతూ ఉంటాయి. కాని సదాచారం అటువంటిది కాదు. సంపద క్షీణిం చినంతలో సదాచారం క్షీణించదు. ఆచారభ్రష్టుడు మృతకల్పుడు. ఆచారహీనుడు సర్వైశ్వర్యాలతో ఉన్నా ఔన్నత్యం పొందలేడు. పరధనాపహరణకు ప్రయత్నించేవాడూ, స్వకులంలో ముసలం పెట్టే వాడూ, మిత్రద్రోహి, కపటస్వభావుడూ, అసత్య వాడీ, ఉత్తములు కారు. అదేరీతిగా మాతాపితరు లకు దేవతలకు ఆహారమివ్వకుండా అరగించేవాడూ, బ్రహ్మహంతకుడూ, బ్రహ్మద్వేషి పితృతర్పణ రహితుడూ, మన సభలోకి రాకూడదు.

మధురమైన వాక్కూ, ఆస్వాదయోగ్యమైన జలమూ, అవసరమైనస్థలమూ, దర్భాసనమూ ఈ నాల్గింటికి సజ్జన గృహాలలో లోటురాదు. ఈ నాలుగూ ధర్మపురుష గృహాలలో శ్రద్ధతో చూపబడుతుంటాయి. రథం చిన్నదైనా ఎంతో బరువు మొయ్యగలుగుతుంది. కాని ఎంత పెద్దదైనా కర్రకు బరువు మోసే శక్తి లేదు. అదేరీతిగా ఉత్తమకులంలో ఉన్నవారు ఎంతటి భారమైనా భరించగలరు. ఎదుటివారి కోపానికి భయపడి వారివల్ల ప్రమాదాన్ని శంకించి చరించేవాడు మిత్రుడుకాడు. పితృతుల్యంగా విశ్వసించ తగినవాడే మిత్రుడు. మిగిలినవారు సహచరులుమాత్రమే. ఇతఃపూర్వము ఏ సంబంధమూ లేకపోయినా మైత్రిని ప్రకటిస్తూ సహాయకుడై ఆశ్రయుడై అచంచలచిత్తుడై వృద్ధసంసేవకుడై ఉండేవాడే మిత్రుడు. ఎండిన కొలనుచుట్టూ హంసలు తిరగవచ్చు. కాని అందులో ప్రవేశించవు. అదేరీతిగా చంచలుడూ, అజ్ఞానీ, ఇంద్రియలోలుడూ అయినవానిని లక్ష్మి వరించదు. మెరుపువలె అతిచంచలమైనది దుష్టస్వభావము. వారికి అకస్మాత్తుగా ఆగ్రహమూ అనుగ్రహమూ కూడా కలుగు

తాయి. కృతఘ్నుల మాంసము జంతువులు కూడా ముట్టవు. సిరిసంపదలున్నా పోయినా మిత్ర సత్కారం జరుగుతూనే ఉండాలి. మిత్రుల శక్తి యుక్తులను పరీక్షిస్తూ కూర్చోకూడదు. సంతాపం వల్ల బలమూ, రూపమూ, జ్ఞానమూ నశిస్తాయి. అంతేకాని అభీష్ట వస్తువులు సిద్ధించవు.

మహారాజా! అందుచేత మీరు సంతాపం విడిచి పెట్టి ప్రసన్నచిత్తంతో ఉండండి. జనన మరణాలు జీవికి ఎన్నోసార్లు కలుగుతూంటాయి. సుఖ దుఃఖాలు లాభనష్టాలు ప్రతిప్రాణికి సహజమే. అందుచేతనే ధీరుడు వీటివిషయంలో హర్షశోకాలు పెంచుకోడు. ఈ ఇంద్రియాలున్నవే అవి మరీ చంచలమైనవి. ఏ ఇంద్రియం విషయాసక్తమౌతుందో అటువైపు బుద్ధి క్షీణిస్తూంటుంది. కుండకు ఏవైపున రంధ్రమేర్పడితే అటునుండే కదా నీరు పోతుంది!

ధృతరాష్ట్రుడు:— సూక్ష్మధర్మబంధితుడూ శిఖాసంశోభితుడూ అయిన ధర్మరాజుతో నేను కపటవ్యవహారం సాగించాను. పర్యవసానంగా వారు యుద్ధంచేసి నాకుమారులను సంహరిస్తారు.

ఇది సౌహృదయాన్ని వేధిస్తోంది. దీనిని వదులుకొనే శాంతిమార్గం చెప్పు.

తపస్సూ ఇంద్రియ నిగ్రహమూ, విద్య తప్ప శాంతిసాధనా లేమీ లేవు. లోభరహిత బుద్ధితో చరించిన వానికి ఏ హానీ ఉండదు. మన బుద్ధితో మన భయాలను దూరం చేసుకుని తపస్సుతో ఉత్తమ పదం పొందగలం. గురుశుశ్రూషతో జ్ఞానం సిద్ధిస్తుంది. యోగంవల్ల శాంతి కలుగుతుంది. మోక్షవాంఛ కలవాడు వేద దాన సంజనితమైన పుణ్యాన్ని ఆశించక నిష్కామదృష్టితో చరిస్తూంటాడు. సక్రమవిధానంగా చేసిన వేదాధ్యయన ఫలమూ న్యాయంగా చేసిన యుద్ధఫలమూ పుణ్యకర్మల ఫలమూ తపః ఫలమూ అంతమందే సౌఖ్యమిస్తాయి. విద్వేషం కలవారు హంసతూలికా తల్పంమీద శయనించినా సుఖంగా నిద్రపోలేరు, పరిసరాలలో వంది మాగధ నారీజనులు సంకీర్తనాలు చేస్తున్నా సంతోషించలేరు. ధర్మమార్గాన చరించలేరు. గౌరవ సుఖాలను అనుభవించలేరు. శాంతిమార్గమూ, హితవాక్యమూ వారికి నచ్చవు. వారికి క్షేమం కలుగదు. వినాశనమేగత్యంతరం. బ్రాహ్మణుని

తపస్సూ, యువతులయందు చపలత్వమూ, ఆవు దగ్గరపాలవలె ఉంటాయి. అదే రీతిగా స్వజాతి వైరం నిసర్గమైన యందువల్ల ఏర్పడడంలో అసంభవం లేదు. అనుదినము నీటితో తడుపబడి పెరిగే లతలు గాలితరంగాలను హించకలుగుతాయి. అదే రీతిగా సజ్జనులు భంగత్వబలంవల్ల క్లేశాలను సహించగలరు. కట్టెలు విడివిడిగా పడిఉంటే పొగలు మాత్రమే వస్తాయి. కలిసినప్పుడు మండుతాయి. అదేరీతిగా బంధుకోటి భేదభావంతో చరిస్తే దుఃఖమే వస్తుంది. గో, నారీ, విప్ర స్వజాతిజనులమీద తమ శౌర్యం ప్రకటించేవారు మిగుల ముగ్గిన పండువలె నేలకూలుతారు. చెట్టు తానొక్కటీ పెరిగినట్టయితే బలంగానూ, గట్టివేళ్ళతోనూ ఉండవచ్చు, కానీ గాలివాన ఒక్క క్షణంలో దాన్ని ఊడ్చివేస్తుంది. కాని వృక్షసమూహం పరస్పర సహకారంతో ప్రచండానిలాలను సహించగలవు. అదే రీతిగా సద్గుణ సంపన్నుడు ఏకాకిగా ఉంటే శత్రువులు వానిని చెప్పినట్లు ఆ వృక్షంలానే చూస్తారు. కాని కలయికవల్ల సరోవరంలోని కమలాలవలె ప్రజలు వర్ధిల్లుతారు. గోవులు, విప్రులు, కుటుంబ

జనులు, స్త్రీలు, బాలురు, శరణాగతులు, అన్నదాతలు, అవధ్యులని విదులు ఘోషిస్తున్నారు. మనుష్యునిలో ఆరోగ్యమూ సంపదా రెండూ తప్ప మరే గుణమూ లేదు. రోగి శవకల్పుడు. రోగరహితంగా పుట్టి శిరోవేదనతో వేధిస్తూ పాపకర్మలకు సహకరించే క్రోధాన్ని దిగమ్రింగి మీరు శాంతి పొందాలి. రోగి నోటికి మధురపదార్థాలు రుచించవు. ఏ విషయమూ సుఖాన్నివ్వదు. దుఃఖమే వారిని వేధిస్తుటూంది. భోగాలు సుఖాలు దూరంగానే ఉంటాయి.

మహారాజా! ద్యూతసమయంలో వీరు ద్రౌపతినికుడా జయించినప్పుడు ఈ ప్రయత్నం నుండి వీరిని విరమింపజెయ్యమని మీతో చెప్పాను. విద్వాంసులు దీనిని మెచ్చుడంలేదని చెప్పాను. కానీ నామాట మీరు చెవిని బెట్టలేదు. పైకి మృదువుగా కన్పిస్తూ విరోధభావంతో చరించడం ఎవరికీ మంచిది కాదు ధర్మసూక్ష్మాలను గ్రహించి ఆచరించాలి క్రౌర్యంతో సాధించిన సంపదలు నశిస్తాయి. మృదువ్యవహారమే సంపదలకు శాశ్వతత్వం చేకూరుస్తుంది. కురుపాండవులుభయులూ వైరభావం విడిచిపెట్టి సఖ్యంతో సాగాలి. ఉభయులూ సర్వ

సమృద్ధితో జీవించాలి. ఈ కురువంశం మీ అధీనంలో ఉంది. కౌంతేయులు యింకా బాలురు. వారు ఎన్నో వనవాసక్లేశాలు అనుభవించి వచ్చారు. వారిని రక్షించి మీ కీర్తిని దిగంతవ్యాప్తం చేసుకోండి, అప్పుడు మీ శత్రువులు మీకు భయపడతారు. సత్యప్రియులైన పాండవులతో సంగ్రామం సాగించడం ఉచితం కాదని చెప్పి దుర్యోధనుని వారించండి.

మహారాజా ! స్వాయంభువమనువు మనుష్యులను కొన్ని తరగతులుగా విభజించాడు. వారి వివరాలు వినండి. ఆకాశాన్ని తమ గుప్పిడితో వేధించ ప్రయత్నించేవారూ, ఇంద్రధనస్సును వంచడానికి యత్నించేవారూ, సూర్యకిరణాలను పట్టుకోవడానికి ప్రయత్నించేవారూ ఉన్నారు. వీరినందరినీ యమదూతలు నరకానికి తీసుకొని వెడతారు. శత్రువును సేవించేవారు, యోగ్యులను శాసించేవారు, అనర్థా స్త్రీని రక్షించేవారు, అమెద్వారా ఆత్మకళ్యాణం కోరేవారు, అయోగ్యులను యాచించేవాడు కులీనుడై జన్మించి నీచకర్మలు చేసేవాడు, దుర్బలుడై బలిష్ఠులతో వైరం పెంచుకొనేవాడు, శ్రద్ధ లేనివానికి ఉప

దేశమిచ్చేవాడు, కోరరాని వస్తువులను కోరేవాడు, కోడలితో పరిహాసాలాడేవాడు, ఏకాంతంలో ఆమెతో చరించి ప్రతిష్ఠను నిలబెట్టుకో ప్రయత్నించేవాడు, పరస్త్రీ సంగమం చేసేవాడు, మహిళామణులను నిందించేవాడు, యితరులమండి గ్రహించినదానిని విస్మరించేవాడు, దానంచేసి ఆవిషయాన్ని పదిమంది ముందు ప్రకటించుకొనేవాడు, అసత్యాన్నిసత్యంగా ప్రతిపాదించేవాడు, అని మనువు మానవుల పతన తరగతులను విభజించాడు.

మహారాజా ! ఎదుటిప్రాణి తనతో ఎలా వ్యవహరిస్తే తానుకూడా వారితో అలానే వర్తించాలి. కపట వ్యవహారానికి కపటప్రవృత్తియే ఉచితవ్యాపారం. సక్రమ వ్యవహారానకి సన్మార్గమే ఆధారము. వార్ధక్యంరూపాన్నీ, ఆశధైర్యాన్నీ, మృత్యువు ప్రాణాన్నీ, దోషదృష్టి ధర్మాన్నీ, కామం సిగ్గునూ నీచపురుషసంసేవనం సదాచారాన్నీ, క్రోధం సంపదలనూ, అభిమానం సర్వస్వాన్నీ నశింపజేస్తాయి— అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు తన సందేహాలను నివారించుకొనేందుకు తిరిగి ప్రశ్నిస్తున్నాడు.

వేదాలు పురుషుని ఆయుఃప్రమాణాన్ని నూరు సంవత్సరాలని నిర్ణయించాయి. అయినా మానవుడు అకాలంలో ఎందుకు మరణిస్తాడు- అన్నాడు ధృతరాష్ట్రుడు.

ప్రభూ! మీకు మేలగుగాక! అధికప్రసంగాలూ క్రోధమూ, అపారమైనఅభిమానమూ, త్యాగశూన్యత్వమూ, ఉదరపోషణచింతా, మిత్రద్రోహమూ, అనే ఆరుకరవాలాలు మానవుని ఆయుఃప్రమాణాన్ని తెగనరుకుతూంటాయి. ఇవే వానిని వధిస్తాయి. కాని మృత్యువుకాదు. తనను విశ్వసించినవాని పత్నితో సంగమించేవాడూ, గురుభార్యతో కామవ్యవహారం సాగించేవాడూ, విప్రుడై శూద్రస్త్రీని పరిణయమాడేవాడూ, సురాపానప్రమత్తుడూ, అన్యకులజుడై విప్రులను ఆదేశించేవాడూ, విప్రజీవికను నాశనం చేసేవాడూ, వారిని తన సేవలో నియోగించుకొనేవాడూ, శరణాగతులను హింసించేవాడూ, వీరందరూ బ్రహ్మహత్యాపాతకులు. వీరి సాంగత్యం ప్రాయశ్చిత్తంతో కాని తీరదు. నీతివేత్త, దాత, యజ్ఞశేషాన్నభోక్త, అహింసారతుడు, గురువృద్ధ జనాదేశపరాయణుడు, అనర్థకార్యదూరుడు, సత్య

వాది, కృతజ్ఞుడు, మృదుస్వభావుడు అయిన విద్వాంసుడు స్వర్గం చేరతాడు.

మనకు ప్రియం చెప్పేవారు అనేకులు అయాచితంగా లభిస్తారు. కాని హితవు చెప్పే వక్త దొరకడు. ఆ వక్తకూ శ్రోతలు లభించరు. ధర్మాశయుడై స్వామికి ప్రియాప్రియాలు ఆలోచించి హితవు పలికేవాడు ప్రభు సేవకులలో ఉత్తముడు. కులరక్షణార్థం వ్యక్తినీ, గ్రామరక్షణార్థం కులాన్నీ, దేశరక్షణకోసం గ్రామాన్నీ, ఆత్మసౌభాగ్యంకోసం పృథివినీ విడిచిపెట్టాలి. ఆపదలనుండి ధనాన్ని రక్షించుకోవాలి. ధనంతో స్త్రీనీ, స్త్రీ ధనాలతో ఆత్మనూ రక్షించుకోవాలి. ద్యూతం కలహహేతువని పూర్వమెందరో ఘోషించారు. కనక ధీమంతుడు కాలక్షేపానికి కూడా ద్యూతప్రసంగాన్ని రానివ్వకూడదు. ఈ విషయం ద్యూతారంభవేళ మీకు నేను చెప్పాను. రోగికి పత్యమూ ఔషధమూ రుచించనట్లే నా మాటలు మీకు రుచించలేదు. కాకపక్షాలుగల మీ కుమారులు నెమలిరెక్కలుగల పాండవులను జయించడానికి ప్రయత్నిస్తున్నారు. మీరు మృగేంద్రాలను విడిచి సృగాలాలను రక్షిద్దా

మనుకుంటున్నారు. కాలమాసన్న మైతేగానీ మీకు పశ్చాత్తాపం రాదు. తన హితాన్ని కోరే సేవకుని యందు క్రోధం చూపని ప్రభువును భృత్యులు విశ్వసిస్తారు. ఎన్ని ఆపదలు వచ్చినా వారు ప్రభువును విడువరు.

సేవకుల జీవితభారాన్ని లక్ష్యం చెయ్యకుండా యితరుల రాజ్యధనాలను అపహరించే ప్రయత్నం చేయకూడదు. భోగవంచితులైన మంత్రులు జీవితం నిర్వహించలేక విద్వేషులతో కలుస్తారు. తమ ప్రభువును విడిచిపెడతారు. ఆదాయవ్యయాల ననుసరించి ఉచితరీతిని వేతనాలు యిస్తూ యోగ్యులను సహాయకులుగా గ్రహించాలి. అందువల్ల ఎంతటి క్లిష్టకార్యాలైనా సాధించవచ్చు. ప్రభువుయొక్క అభిమతం గ్రహించి సకాలంలో సర్వకార్యాలు నిర్వర్తించేవాడూ, హితవునే చెప్పేవాడూ, స్వామిభక్తుడూ, సజ్జనుడూ, రాజశక్తిని ఎరిగినవాడూ ప్రభువుతో సమానుడు. రాజుయొక్క ఆదేశాన్ని పాలించకుండా ఇతరకార్యమగ్నుడై అహంకారంతో ప్రభువును ప్రతికూలిస్తూ ప్రసంగించే సేవకుని ఉత్తరక్షణంలో పరిత్యజించాలి. అహంకార

జూన్యుడూ, శీఘ్రకార్యరహితుడూ, దయాళువూ పరిశుద్ధ, చిత్తుడూ ఇతరుల ఎరలకులొంగనివాడూ, ఆరోగ్యవంతుడూ, ఉదారవచనుడూ, అయిన వానిని దూతగా గ్రహించాలి. సావధానచిత్తంతో మెలిగే వాడు సమయాసమయాలు గుర్తించకూండా కేవల విశ్వాసంతో పరగృహాలకు పోకూడదు. రాత్రివేళల శృంగాటకాలలో నిలబడకూడదు, ప్రభువు వాంఛించే స్త్రీని అభిలషించకూడదు. దుష్టులైన మంత్రులతో పరివేష్టితుడై రాజు కొలువులో ఉన్నప్పుడు వానిమాటను ఖండించకూడదు. తన అవిశ్వాసాన్ని ప్రకటించకూడదు. ఆ సభలో ఆసీనుడై ఉండడమే శ్రేయస్కరం కాదు. ఏదో యుక్తితో సభనుండి నిష్క్రమించాలి. దయాహృదయుడైన రాజుతో వ్యభిచరించే స్త్రీతో, పుత్రులతో, సోదరులతో రాజోద్యోగులతో, పసిపిల్లలుగలవిధవతో, సైనికులతో అధికారం కోల్పోయినవారితో, ఇచ్చిపుచ్చుకొనే వ్యాపారాలు సాగించకూడదు. ఉత్తమకులమూ, శాస్త్రజ్ఞానమూ, ఇంద్రియనిగ్రహమూ, పరాక్రమమూ, దానశీలమూ, కృతజ్ఞతాస్వభావమూ, మితభాషిత్వమూ గల పురుషులు ప్రపంచంలో కీర్తి

పొందుతారు. నిత్యస్నాతుడి కివన్నీ లభిస్తాయి. బలరూపాలూ, ఉజ్జ్వల దేహకాంతీ, కోమలస్వభావమూ, మధురకంఠమూ, సుగంధదేహమూ, పవిత్రాచారమూ, సౌకుమార్యమూ, శోభా, సుందర స్త్రీజన పరిచయమూ, నిత్యస్నాతునికి చేరుతాయి. మితంగా భుజించేవానికి బలంతోపాటు సుఖమూ, ఉత్తమసంతానమూ, ఆరోగ్యమూ, ఆయుర్దాయమూ లభిస్తాయి.

సోమరి, అమితభక్షకుడు, సర్వజనవిరోధి, మాయావిదుడు, క్రూరుడు, దేశకాల జ్ఞానశూన్యుడు నిందితవేషాలు ధరించేవాడు వీరిని మనఇండ్లలో ఉండనివ్వరాదు. దుఃఖంలో ఉన్నా కృపణుడూ, మూర్ఖుడూ, నిందస్వభావుడూ, ధూర్తుడూ, అరణ్యవాసీ, నీచసేవకుడూ, దయారహితుడూ, కృతఘ్నుడూ, వైరీ అయినవారి సహాయం కోరకూడదు. ప్రమాదపరిస్థితులు కల్పించేవాడూ, క్లేశకరుడూ, అసత్యవాదీ, స్నేహితుడూ, అస్థిరభక్తుడూ, స్వాభిమానీ అయినవానిని సేవించరాదు.

ధనం సంపాదించడానికి సహాయమవసరం. సహాయకుడు ధనాన్ని వాంఛిస్తాడు. ఈ విధంగా

వీరిమధ్య ఒక అనుబంధం ఉన్నది.

పుత్రులను కని వారిని ఋణముక్తులను చేసి వారి జీవితానికి ఉచితమైన ఏర్పాట్లు చేయాలి. తన కుమార్తెలకు యోగ్యులైన వరులతో పెండ్లిండ్లుచేసి మునివృత్తిని గ్రహించి జీవించాలి. సర్వప్రాణి హితకరమై ఆత్మసుఖదాయకమై ఉండే పనిని నిష్కామదృష్ట్యా ఈశ్వరార్పణ బుద్ధితో చెయ్యడమే సర్వసిద్ధులకూ మూలము. ఎవని పరాక్రమ ప్రభావ ఉద్యోగ తేజశ్శక్తులు ప్రవృద్ధ మవుతూంటాయో వానికి జీవితనిర్వహణమీద భయం కలగదు. మీ రిప్పుడు పాండవులతో యుద్ధం చేసే దృష్టితో ఉన్నారు. ఒక్కసారి ఆలోచించండి, పాండవులతో సంగ్రామం ఇంద్రాదులకు కూడా ప్రమాదమే.

ఉద్వేగపూర్ణమైన జీవితం కీర్తిని నశింపచేస్తుంది. పుత్రసదృశులతో వైరం శత్రుకోటికి బలాన్ని కూరు స్తుంది. ఆకాశంలో వక్రంగా ఉదయించే ధూమ కేతువు ఉపద్రవాలకు హేతువు. అదేరీతిగా భీష్మ, ద్రోణ, ధర్మరాజాదుల క్రోధం నాశనానికే వస్తుంది. నీ నూరుగురు బిడ్డలూ, కర్ణుడూ, పంచపాండవులూ కలిసి ఉంటే ఈ సముద్రపర్యంతభూమండలాన్నీ

శాసించగలరు. దుర్యోధనాదులు అరణ్యమైతే పాండవులు వనవ్యాఘ్రాలు. అరణ్యంనుండి శార్దూలాలను పారద్రోలి వనాన్ని నశింపచెయ్యకండి, పాపైకచిత్తులూ, పరదోషపరాయణులూ పోయేవారిని పోవద్దు. స్వర్గంనుండి అమృతం చితం కానట్లు ధర్మంనుండి అర్థం వేరుకాదు. పాపదూరుడై కళ్యాణ లగ్నచిత్తుడై చరించేవాడు ప్రపంచ స్వభావాన్ని గ్రహించి ధర్మార్థకామాలు సేవిస్తూ ఇహపరాలలో ఉత్తమస్థితి పొందుతాడు. హర్ష క్రోధ సంజనితమైన ఆవేశాలను లొంగదీస్తూ ఆపదలు వచ్చిపడ్డా వ్యామోహం పొందనివాడు రాజ్యలక్ష్మిని పొందుతాడు,

మహారాజా! మనుష్యుడు నాలుగు బలాలతో ఉంటాడు. మొదటిది బాహుబలము. అది నికృష్టమైనది. రెండవది మంచి మంత్రి. ధనసంపదలు మూడోబలం. , పితృపైతామహ సంప్రాప్తమైన దున్నదే అది సహజాతబలము. ఈ బలాలన్నిటికీ మించినది బుద్ధిబలము.

మనకు విపరీతమైన ప్రమాదాలు కలిగించే పురుషునికి దూరంగా ఉండి వానివల్ల మనకు ఏ

వీరిమధ్య ఒక అనుబంధం ఉన్నది.

పుత్రులను కని వారిని ఋణముక్తులను చేసి వారి జీవితానికి ఉచితమైన ఏర్పాట్లు చేయాలి. తన కుమార్తెలకు యోగ్యులైన వరులతో పెండ్లిండ్లుచేసి మునివృత్తిని గ్రహించి జీవించాలి. సర్వప్రాణి హితకరమై ఆత్మసుఖదాయకమై ఉండే పనిని నిష్కామదృష్ట్యా ఈశ్వరార్పణ బుద్ధితో చెయ్యడమే సర్వసిద్ధులకూ మూలము. ఎవని పరాక్రమ ప్రభావ ఉద్యోగ తేజశ్శక్తులు ప్రవృద్ధ మవుతూంటాయో వానికి జీవితనిర్వహణమీద భయం కలగదు. మీ రిప్పుడు పాండవులతో యుద్ధం చేసే దృష్టితో ఉన్నారు. ఒక్కసారి ఆలోచించండి. పాండవులతో సంగ్రామం ఇంద్రాదులకు కూడా ప్రమాదమే.

ఉద్వేగపూర్ణమైన జీవితం కీర్తిని నశింపచేస్తుంది. పుత్రసదృశులతో వైరం శత్రుకోటికి బలాన్ని కూరుస్తుంది. ఆకాశంలో వక్రంగా ఉదయించే ధూమకేతువు ఉపద్రవాలకు హేతువు. అదేరీతిగా భీష్మ, ద్రోణ, ధర్మరాజాదుల క్రోధం నాశనానికే వస్తుంది. నీ నూరుగురు బిడ్డలూ, కర్ణుడూ, పంచపాండవులూ కలిసి ఉంటే ఈ సముద్రపర్యంతభూమండలాన్ని

శాసించగలరు. దుర్యోధనాదులు అరణ్యమైతే పాండవులు వనవ్యాఘ్రాలు. అరణ్యంనుండి శార్దూలాలను పారద్రోలి వనాన్ని నశింపచెయ్యకండి. పాపైక చిత్తులూ, పరదోషపరాయణులూ పోయేవారిని పోవద్దు. స్వర్గంనుండి అమృతం చితం కానట్లు ధర్మంనుండి అర్థం వేరుకాదు. పాపదూరుడై కళ్యాణ లగ్నచిత్తుడై చరించేవాడు ప్రపంచ స్వభావాన్ని గ్రహించి ధర్మార్థకామాలు సేవిస్తూ ఇహపరాలలో ఉత్తమస్థితి పొందుతాడు. హర్ష క్రోధ సంజనితమైన ఆవేశాలను లొంగదీస్తూ ఆపదలు వచ్చిపడ్డా వ్యామోహం పొందనివాడు రాజ్యలక్ష్మిని పొందుతాడు.

మహారాజా! మనుష్యుడు నాలుగు బలాలతో ఉంటాడు. మొదటిది బాహుబలము. అది నికృష్టమైనది. రెండవది మంచి మంత్రి. ధనసంపదలు మూడోబలం. పితృపైతామహ సంప్రాప్తమైనదున్నదే అది సహజాతబలము. ఈ బలాలన్నిటికీ మించినది బుద్ధిబలము.

మనకు విపరీతమైన ప్రమాదాలు కలిగించే పురుషునికి దూరంగా ఉండి వానివల్ల మనకు ఏ

ప్రమాదమూ లేదని విశ్వసించరాదు. ప్రభువుమీద శత్రువులమీద నారీ, భోగ, సామర్థ్య, సర్ప, ఆయుర్దాయాలమీద అధ్యయనంమీద కేవలవిశ్వాసముంచేవాడుండడు. బుద్ధిశరము వేధిస్తే వానికి వైద్యుడు ఏమీ చేయలేడు. హోమమంత్రసూత్ర ప్రయోగాలేమీ పనిచెయ్యవు. అగ్ని, సింహ, సర్పాలను ఉలక్ష్యం చేసినా, స్వకులసంజాతులను అనాదరించినా ప్రమాదమే. అగ్నికంటె తేజస్సు కలది లేదు, అది కాష్ఠంలో ఉంటుంది. ఒకరువచ్చి మధనం చేసేవరకూ అది ఆకట్టెను మండించదు. అంటుకుంటే అరణ్యంతోపాటు సర్వాన్నీ దగ్ధం చేస్తుంది. ఇదేరీతిగా ఆత్మవంశీయులైన పాండవులు అగ్నిసదృశతేజోమయులు. క్షమాహృదయులు. వికారశూన్యులు; కాష్ఠంలో వారు అగ్నిలా దాగి ఉన్నారు అంతే. వారు వృక్షాలు; నీ కొడుకులు లతలు. వారు సింహాలు; నీ కొడుకు లొక అరణ్యం. సింహంలేని అడవీ, అడవిలేని సింహమూ నశించక తప్పదు. అని ఇంకా యిలా కొనసాగిస్తున్నాడు,

పూజనీయులు వచ్చినప్పుడు యువకులకు ఒక విధమైన భీతి ముందు కలుగుతుంది. కాని వచ్చిన

వారిని సక్రమంగా అర్చించడంతో నవతేజం ప్రాప్తిస్తుంది. సజ్జనుడు మనగృహానికి వచ్చినప్పుడు అర్ఘ్యపాద్యాలిచ్చి ఆసనంచూపి కుశల ప్రశ్నలడిగి యథాశక్తిగా భోజనం పెట్టాలి. వేదవిదులు ఎవని గృహంలో ఈ విధమైన మర్యాదలు పొందరో వాడు భ్రష్టుడవుతాడు. వైద్యుడు, శస్త్రచికిత్స కుడు, బ్రహ్మచర్య భ్రష్టుడూ, క్రూరుడు, చోరుడు, భ్రూణహంతకుడు, సురాపాయి, సేవాజీవి, వేద విక్రేత — వీరు పాదప్రక్షాళనార్హులుకారు. అయినా అతిథులుగా వచ్చినప్పుడు వారికికూడా ఆ మర్యా దలు చేయాలి. ఉప్పు, పక్వాన్నము, పాలు పెరుగు, తేనె, తైలము, నెయ్యి, నువ్వులు, మాంసము, పళ్ళు, కాషాయవస్త్రాలు, గంధము, బెల్లము — ఇవి విక్ర యించకూడదు. సువర్ణ, పాషాణాలను ఏకదృష్టితో చూసేవాడూ, శోక క్రోధరహితుడూ, సంధి విగ్ర హావశ్యకత లేనివాడూ, నిందాప్రశంసలను లక్ష్యపెట్ట నివాడూ ,ప్రియాప్రియాలతో నిమిత్తం లేనివాడూ, ఉదాసీనుడూ, భిక్షుకుడూ, అయినవానిని సన్యాసి అంటారు. ఆకుకూరలు, నివ్వరధాన్యము, ఇంగుళీ ఫలాలు, కందమూలాలు ఆహారంగా గ్రహించి మన

స్సును వశంలో ఉంచుకొని అగ్నికార్యం నిర్వర్తిస్తూ అరణ్యవాసం చేస్తున్నా అతిథిసేవ సాగిస్తూండే వాడు తపస్వి.

ధీమంతులకు కీడు కలిగించి తాను దూరంగా ఉన్నానని భావించకూడదు. బుద్ధిమంతుల భుజాలు అతి విశాలాలు. వారి బాహువులు ఎంత దూరంలో ఉన్నా ప్రతీకారం చేసి తీరతాయి. విశ్వాసపాత్రుడు కానివానిని విశ్వసించకూడదు. సరేకదా విశ్వసనీయులను కూడా అధికంగా నమ్మకూడదు. అందువల్ల కలిగే భయం మూలచ్ఛేదకారి. ఈర్ష్యారహితుడై సంపదలను నీతిశాస్త్రప్రకారం వినియోగిస్తూ ప్రియభాషియై నారీజనరక్షకుడై వారికి లొంగకుండా జీవించాలి. స్త్రీ గృహలక్ష్మి. ఆమె సౌభాగ్యశాలిని కనుక గృహానికి అలంకారము. అందుచేత వారి రక్షణ అవసరం. అంతఃపుర సంరక్షణ గృహయజమాని వహించాలి. గృహసంరక్షణ ఇల్లాలు వహించాలి. గోసేవ తనతో సముడైనవాడు చేయాలి. కృషి స్వయంగా సాగించాలి. సేవకులు వాణిజ్యవిషయాలు చూడాలి. పుత్రులు బ్రాహ్మణసేవ చెయ్యాలి. నీటినుండి అగ్ని, విప్రునినుండి క్షత్రి

యుడూ, శిలలనుండి లోహమూ ఉద్భవించాయి. వీని తేజస్సు సర్వేసర్వత్రా ప్రసరిస్తుంది. కాని ఉత్పత్తిస్థానాలదగ్గరమాత్రం ప్రశాంతంగానే ఉంటుంది. ఉత్తమకుల సంజాతుడై అగ్నిసదృశ తేజస్వియై క్షమాశీలుడై వికారశూన్యుడై చరించే సత్పురుషుడు కర్రలోని నిప్పువలె శాంతంగానే ఉంటాడు. ప్రభువుయొక్క మంత్రాంగం ఎవరూ ఎరుగకూడదు. అలా ఉండగలిగితే వాని సంపదలు చిరకాలం నిలుస్తాయి, ధర్మార్థకామాలు ఆచరించే ముందు వానిని గూర్చి ప్రస్తావించగూడదు. అవి ఆచరించి చూపాలి. అంతే. పర్వతశిఖరంమీదా, రాజభవనంలోనూ, లతాతృణాదులు లేని ప్రాంతంలోను ఆలోచనలు సాగించాలి. మిత్రుడు కానివాడు మిత్రుడైనా, పండితుడు కానివాడు పండితుడైనా, మనస్సును జయించనివాడు ఆలోచనలో పాల్గొనడానికే పనికిరారు. పూర్వాపరాలు పరిశీలించనిదే ఎవరినీ మంత్రిగా గ్రహించకూడదు. మంత్రాంగరక్షణ భారము, కోశాగారము వారి చేతులలో ఉంటాయి. కనుక మంత్రివిషయమై బాగా యోచించాలి. ధర్మార్థకామవిషయాలు పూర్తికానిదే ప్రజలకు తెలి

యకూడదు. మోహావశుడై పాపకర్మలు చేసేవాడు ప్రాణాలను కోల్పోతాడు. ఉత్తమకర్మలు సుఖదాయకాలు. వేదాధ్యయనంలేని విప్రుడు శ్రాద్ధకర్మకు అర్హుడుకాడు, సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావసమాశ్రయాలు తెలియనివాడు ఆలోచనా పరిషత్తులో ఉండకూడదు. స్థితి, వృద్ధి, హ్రాసము గ్రహించి పైన చెప్పిన ఆరుగుణాలు కలిగినవాడు ప్రజాప్రశంసలతో ప్రభుత్వము సాగించగలడు. వ్యర్ధంగా క్రోధమూ హర్షమూ పొందకుండా సమయానుసారం కార్యం నిర్వర్తిస్తూ ఆదాయవ్యయాలు పరిశీలించుకుంటూ రాజలాంఛనాలతో తృప్తిపడుతూ సేవకులను అనుగ్రహదృష్టితో చూస్తూచరించాలి. విప్రుని ఉత్తమత్వం విప్రుడే గ్రహించగలడు. భార్య స్వభావం భర్తకు తెలుసు. మంత్రి శక్తి రాజుకు తెలుసు. రాజుశక్తి రాజుకే తెలుసు. చేజిక్కిన శత్రువును విడిచి పెట్టకూడదు. వానిని పరిమార్చడానికి శక్తి లేకపోతే కొంతకాలం వేచి ఉండాలి. శత్రువు జీవించి ఉంటే ఎప్పుడూ ప్రమాదమే. దేవ, బ్రాహ్మణ, వృద్ధ రోగులమీదా ప్రభువులమీదా బాలురమీదా కలిగే క్రోధం తక్షణమే

ఉపసంహరింపబడాలి. మూర్ఖులను సేవిస్తూ కలహ స్వభావంతో ఉండేవానిని తక్షణం పరిత్యజించాలి. ప్రయోజనరహితంగా ఆగ్రహానుగ్రహాలు ప్రసంగించే ప్రభువును ప్రజలు విడుస్తారు. మూర్ఖత్వమే దరిద్రలక్షణం. ధీశక్తి ధనసంపాదన హేతువు. సంసారచక్రభ్రమణరహస్యం విద్వాంసులే గ్రహించగలరు. విద్య, శీల, బుద్ధి, ధన కులగౌరవాలను మూర్ఖుడు అనాదరిస్తాడు. దానశీలము, అకృత్రిమస్వభావము, ప్రతిజ్ఞాపాలనము కలవాడు సర్వభూతాలను స్వాధీనంలో ఉంచుకోగలడు. కృతజ్ఞుడు, చతురుడు, మృదుస్వభావుడు, ధీమంతుడు ఐనరాజు ధనసంపదలతో సర్వసహాయమూ పొందగలడు. ధైర్యము, మనోనిగ్రహము, ఇంద్రియసంయమనము, దయాహృదయము, మధురభాషిత్వము, మిత్రవాత్సల్యము, పవిత్రాచారము ఇవి లక్ష్మీవర్ధకాలు. ఆశ్రితులకు ధనాదులివ్వకుండా దుష్టస్వభావంతో కృతఘ్నుడై లజ్జాశూన్యుడై చరించే ప్రభువును పరిత్యజించాలి. తాను దోషాలు చేస్తూ నిర్దోషులకు క్రోధం కలిగిస్తూ చరించేవాడు విశ్రాంతి పొందలేడు. ధనధాన్యాలు పతితుల, నీచుల, ప్రమ

త్తుల స్త్రీల స్వాధీనంలో ఉంచకూడదు. జూదరి, బాలుడు, స్త్రీ ప్రభుత్వం సాగిస్తే ఆ దేశంలోని ప్రజలు శిలానౌకపై పయనించే మనుష్యులవలె విపత్సాగరంలో మునిగిపోతారు. అనవసర ప్రసంగాలలో కార్యాలలో జోక్యం కలిగించుకోనివారు ధీమంతులు. జూదరులు, నర్తకులు, వేశ్యలు, ఎవరిని కీర్తిస్తారో వారు మృతతుల్యులు.

మహారాజా! తేజోమయులైన పాండవులు మహావీరులు. అది తెలిసికూడా మీరు దుష్టదుర్యోధనునిమీద మీ ఐశ్వర్యభావం విడిచిపెట్టారు. అల్పకాలంలో ఈ దుర్యోధనుడు తన ఐశ్వర్యమదం కారణంగా త్రిభువనసామ్రాజ్యం కోల్పోయిన బలివలె పతనమౌతాడు— అన్నాడు.

విదురుని ప్రసంగం సక్రమంగా ఆకర్ణించి ధృతరాష్ట్రుడు— ధీమంతుడా! ఐశ్వర్యప్రాప్తికీ దాని నాశనానికీ పురుషుడు స్వతంత్రుడు కాడు. విధి అనే రజ్జువుతో బంధింపబడిన మానవుడు ప్రారబ్ధానుసారం నడుస్తాడు. అందుచేత ఆ విషయం విడిచిపెట్టి నువ్వు మరికొన్ని నీతివిషయాలు చెప్పు.

నేను ధైర్యంతో వింటాను– అని అర్థించగా విదురుడు ప్రారంభించాడు.

మహారాజా! సమయం గుర్తించకుండా కాలం పరిశీలించకుండా విపరీతంగా భాషిస్తే బృహస్పతికి కూడా అవమానం తప్పదు. సాధారణంగా ప్రపంచంలో దాత సర్వజన ప్రియుడవుతాడు. ప్రియభాషికూడా ఆ ఖ్యాతిని పొందగలడు. మంత్రౌషధులతో సుఖం కలిగించేవానికి కూడా అటువంటి కీర్తి లభిస్తుంది. ఇన్నిటికీ మించిన కీర్తి సత్యవాక్పాలనవల్ల చెకూరుతుంది. ఎంతటి సాధువైనా విద్వాంసుడైనా ధీశాలియైనా ద్వేషస్వభావంతో ఉంటే వాని సుగుణాలు లెక్కలోనికిరావు. లోకప్రియుడు ఏపని చేసినా శోభనే చేకూరుస్తాయి.

మహారాజా! ఈ దుర్యోధనుడు జన్మించిన నాడు వీనిని పరిత్యజించమని నేను చెప్పాను. ఈ ఒక్కడినీ విడిచిపెడితే మిగిలినవారందరూ వృద్ధిలోకి వస్తారనికూడా చెప్పాను. లేకపోతే ఇందరూ నశించక తప్పదు. భవిష్యత్తులో నాశనం కలిగించేదాన్ని ఈనాడు వృద్ధి పొందనివ్వకూడదు. ఈనాడు క్లేశకారియైనా ముందుముందు అభివృద్ధికి

హేతువవుతుందంటే దానిని పరిగ్రహించాలి. స్వల్పలాభం ఈనాడు లాభంగా గోచరించి అదే ముందు ముందు నష్టానికి హేతువవుతుందని తెలిసినప్పుడు దానిని పరిత్యజించాలి. కొందరు గుణసంపన్నులైతే మరికొందరు ధనసంపన్నులవుతారు. గుణహీనుడైతే ఐశ్వర్యవంతుడైనా వానిని విడిచి పెట్టవలసిందే- అని అనగా ధృతరాష్ట్రుడు- ధీమంతుడా! నువ్వుచెప్పేది ముందు ముందు హితవు కలిగించేది. ధీశాలురు ఈ విషయాలను అంగీకరిస్తారు. ధర్మానికి జయం కలుగుతుందని నాకు తెలుసు. అయినా నేను నా కొడుకును విడిచిపెట్టలేను- అనగా విదురుడు- ప్రభూ! వినయగుణసంపన్నుడు సర్వప్రాణిసంహారం జరుగుతూంటే ఉపేక్షాభావంతో చూస్తూ ఊరుకోలేడు. పరనిందతో బ్రతుకుతూ ఇతరులకు దుఃఖం కలిగిస్తూ వారికీ వీరికీ భేదాలు కల్పిస్తూ ఎవడు సంతోషిస్తాడో వాడు మూర్ఖుడు. ఎవనిని చూడడంవల్ల కష్టం కలుగుతుందో ఎవనిసాంగత్యం దుఃఖహేతువో వానినుండి ఏ ఉపకారమూ పొందకూడదు. కాముకుడు, లజ్జాహీనుడు, శఠుడు, పాపి మన సన్నిధానంలో

ఉండకూడదు. సౌహార్దం నశిస్తే ప్రేమ నశిస్తుంది. తత్ఫలసుఖాలు కూడా క్షీణిస్తాయి. అప్పుడు నీచులు ఎదుటివారిని నిందిస్తారు. స్వల్పాపరాధానికికూడా అనల్పక్లేశాలు కలిగిస్తారు నీచులు. వారిని దూరంలోనే ఉంచుకోవాలి, ఆత్మీయులపై దీన, దుగ్ధ, దరిద్రులపై ఆదరం చూపేవాడు పుత్రపౌత్రసంపదలు పొందుతాడు. ఆత్మోన్నత్యం కోరేవాడు సోదరులను ఉన్నతవిధానంలో నడుపుకోవాలి. ఈ విషయాలు గ్రహించి మీరు కుటుంబ జన క్షేమం ఆలోచించండి. గుణహీనులైన స్వకులీనులను రక్షించు కోవాలి— అని నీతిశాస్త్రం చెబుతూంటే అది విస్మరించి మీరు గుణవంతులూ, కృపాపాత్రులూ అయిన పాండవుల విషయంలో ఎలా చరిస్తున్నారో యోచించండి. మీరు సమర్థులు పాండవులు వీరులు. వారి ననుగ్రహించి వారికి కొన్ని గ్రామాలైనా ఇవ్వండి, అది మీ యశస్సుకు ప్రధానహేతువు. మీరు వంశవృద్ధులు కనక మీ బిడ్డలను శాసించండి. నేను మీ హితంకోరి చెబుతున్నాను. ఉన్నతిని కోరేవారు సోదరులతో వైరం పెంచుకోరు. పరస్పర కుశల ప్రసంగాలతో

వాత్సల్యంతో వారు జీవించాలి. అభ్యుదయ పత నాలకు జ్ఞాతిసోదరులే మూల స్తంభాలు. వారిలో మంచివారు మనలను ఉద్ధరిస్తారు. మూర్ఖులు విప త్తులలో ముంచుతారు. మీరు పాండవులతో సఖ్యం గా ఉండి వారి రక్షణపొందితే శత్రువులు మీవైపు కన్నెత్తి చూడలేరు. విషలిప్త బాణాలు కల బోయ వానిని సమీపించిన మృగం క్లేశాలు పొందేటట్లు ధనికునిచేరి బంధుకోటి దుఃఖా లనుభవిస్తుంది. ఆ పాపం ధనికునే చేరుతుంది.

మహారాజా! దుర్యోధనాదులు కానీ పాండ వులు కానీ ఎవరుమరణించినా మీకు పశ్చాత్తాపం తప్పదు. కనక బాగా ఆలోచించండి. జీవితం అశా శ్వతమైనది. అందుచేత పశ్చాత్తాప మవసరంలే కుండా పనులు పూర్తిచేసుకోవాలి. నీతిమార్గాన్ని ఉల్లంఘించని మనుష్యుడు లేడు. శుక్రాచార్యుడొ క్కడే అందుకు అపవాద. అందుచేత గతాన్ని విస్మరించి భవిష్యత్తును ఆలోచించండి. దుర్యోధ నుడు ఇంతఃపూర్వం వారికెన్నో కష్టాలు కలిగిం చాడు. మీరు పెద్దలు కనక వానికి తగిన శాస్తి చెయ్యండి. ఈనాడు పాండవులకు రాజ్యభాగమిస్తే

మీకు కలిగిన అపఖ్యాతి తొలిగిపోతుంది. మీ యశస్సు వ్యాపిస్తుంది. ధీమంతుల సందేశాన్ని ఆల కించి దాని పరిణామం గ్రహించి ఆదరించేవాడు కీర్తిశాలి అవుతాడు. ధీకుశలుడైన విద్వాంసుడు ఉప దేశించినప్పుడు ఆ మార్గాన నడవకపోతే వాని ఉప దేశంకూడా ప్రయోజన రహితమే అవుతుంది. పాపఫలాలిచ్చే కర్మలను ఆచరించనివాడే ఘనుడు. ధీమంతుడు రాజ్యాంగద్వారషట్కాన్ని గ్రహించి ధనసంరక్షణేచ్ఛతో వాటిని బంధించాలి. మత్తుప దార్థాలు సేవించకూడదు. అధికంగా నిద్ర మం చిది కాదు. ముఖ్యవిషయాలు విస్మరించకూడదు. ముఖంతో నేత్రాలతో వికారాలు చూపించ కూడదు. దుర్బుద్ధులైన మంత్రులను విశ్వసించకూ డదు. కార్యకౌశలంలేని దూతను నమ్మకూడదు. ఈ దారిని పోయినవాడు ధర్మార్థకామ సేవాను గ్నుడై శత్రువులను వశపరచుకోగలడు. బృహస్పతి సదృశధీమంతుడైనా శాస్త్రజ్ఞానాభ్యాసమూ వృద్ధ సేవా లేకపోతే ధర్మార్థజ్ఞాని కాలేడు. సముద్రంలో పడిన పదార్థంవలె ఆకర్ణించని వానికి చెప్పిన నీతి వ్యర్థమవుతుంది. జితేంద్రియుడు కానివాని శాస్త్ర

జ్ఞానము బూడిదలో చేసిన హోమంవంటిది. ధీమంతుడు తన అనుభవాన్ని పరిశీలించుకుంటూ పరులను వీక్షిస్తూ విద్వాంసులతో సఖ్యం సాగిస్తూ నడవాలి. వినయభావం అపకీర్తినీ, పరాక్రమం అనర్థాన్నీ, ఓర్పు క్రోధాన్నీ, సదాచారం దుర్లక్షణాలను దూరం చేస్తాయి. తల్లినీ, గృహాన్నీ, శిష్యునీ, సేవకునీ, చతురంగబలాలనూ ఆహారపదార్థాలిస్తూ రక్షిస్తూ పరిరక్షించుకోవాలి. దేహాభిమానశూన్యులు కూడా న్యాయసమ్మతంగా చేకూరిన దానిని విపరీతభావంతో చూడరు. అటువంటప్పుడు వాంఛారతుని విషయం చెప్పాలా?

విద్వజ్జనులను సేవిస్తూ ధార్మికదృష్టితో మధురభాషియై సుందరరూపుడై మిత్రసహితుడైనవానిని రక్షించడ మవసరం. అధమకులంలో పుట్టినా ఉత్తమకులంలో జన్మించినా మర్యాద నతిక్రమించకుండా సాత్వికంగా చరిస్తూ లజ్జాశీలియైనవాడు శ్రేష్ఠుడు. హృదయసమ్మేళనమూ ఆలోచనా సమైక్యమూ ఏకమార్గ ప్రవర్తనమూ మైత్రికి లక్షణాలు. తృణాచ్ఛాదితమైన నూతిదరికి పోనట్లే దుర్బుద్ధులు కల వ్యక్తులజోలికి పోకూడదు. కృతజ్ఞుడు, ధర్మ

పరుడు, ఉదారుడు అనురాగహృదయుడు, జితేం
ద్రియుడు, సదాచారపరాయణుడు, మిత్రవత్స
లుడు అయిన పురుషునితో సఖ్యం మంచిది. ఇంద్రి
యాలను స్వాధీనంలో ఉంచుకోవడం మృత్యువును
జయించడంకంటె క్లిష్టమైనది ఇంద్రియాశ్వాలు
పట్టు తప్పితే దేవతలను కూడా పడగొడతాయి.
భూతదయ, దోషాన్వేషణరాహిత్యము, క్షమ, ధైర్య
ము, మిత్రులకు అవమానము కలుగజేయకుండుట
అనేవి ఆయుర్వృద్ధికరాలు. నిశ్చలబుద్ధితో నష్టద్ర
వ్యాన్ని సంపాదించడానికి ప్రయత్నించాలి. ముందు
రానున్న దుఃఖాలను నివారించగల ఉపాయాలు
తెలిసినవాడూ కాలానుసారం కర్తవ్యాన్ని పాలించే
వాడూ దృఢనిశ్చయంకలవాడూ అర్థలోపం పొం
దరు. మనోవాక్కాయకర్మలతో దేనిని సేవిస్తే అట్లే
మనుష్యుని మనస్సు మరలుతుంది. అందుచేతనే
మంగళవస్తువులను స్పృశించి దర్శిస్తూ చిత్తాన్ని
నిరోధించి ప్రయత్నశాలియై సరళస్వభావంతో
శాస్త్రా లభ్యసిస్తూ ఉండేవాడు సంపదలు పొందు
తాడు. వానికే అనంతసుఖాలు లభిస్తాయి శీలసా
మర్థ్యం కలవానికి క్షమకంటె హితకరమైనది లేదు.

శక్తిహీనుడు క్షమాశీలంతోనే జీవిస్తాడు. అదేరీతిగా శక్తిసంపన్నుడుకూడా ధర్మవిషయాలలో ఓరిమి కలిగిఉండాలి. అర్థానర్థాలయందు సమదృష్టి కల వానికి ఏ హానీ జరుగదు. మానవుడు ధర్మార్థవిరోధం కలుగకుండా ప్రవర్తించాలి. ప్రమత్తుడూ నాస్తికుడూ దుఃఖపీడితుడూ సంతోషశూన్యుడూ సోమరీ లక్ష్మీసంపన్నులు కాలేరు. దుర్బుద్ధులు సౌమ్యులను శక్తిహీనులుగా భావించి అవమానిస్తారు. మహాదాత, మహావీరుడు, అధికవ్రతపరాయణుడు, గుణశ్రేష్ఠుడు, గుణోపేతుడు అయినవారిని చేరడానికి లక్ష్మి భయపడుతుంది. గుణహీనులనుకూడా అది చేరదు. అయితే ఉన్మత్తయైన గోవువలె లక్ష్మి అక్కడక్కడ ఆగుతుంది.

అగ్నిహోత్రం వేదానికి ఫలం. సదాచారం శాస్త్రఫలం పుత్రసౌఖ్యమూ, రతీ స్త్రీవల్ల లభించే ఫలాలు. దానమూ భోగమూ ధనప్రయోజనం. అధర్మంతో సాధించిన ధనం పుణ్యకార్యాలకు వెచ్చించినా అది ఫలించదు. ఘోరారణ్యంలో దుర్గమమార్గంలో విపత్ సమయాలలో సయితం ఆత్మబలం కలవాడు భయపడడు. సర్వదా ప్రయత్న

శీలమూ సావధానచిత్తమూ ధైర్యమూ జ్ఞాపకశక్తీ కార్యదక్షతా కలవారు ఉన్నతిపొందుతారు. తపస్వులకు తపస్సే బలము. వేదవిదులకు వేదమే బలము, పాపులకు హింస బలము, గుణవంతులకు క్షమ బలము. జలము ఫలము క్షీరము ఘృతము బ్రాహ్మణవాంఛాసిద్ధి గురువచనము ఔషధసేవనము మూలాలు వ్రతనాశకాలు కావు. మనకు ప్రతికూలించేదానిని ఇతరులకోసంకూడా చెయ్యకూడదు. అలా చెయ్యడమే అధర్మం. శాంతంతో క్రోధాన్ని, సద్వ్యవహారంతో అసాధువులను దానంతో లోభాన్ని, సత్యంతో అసత్యాన్ని జయించాలి. దురభిమాని, ధూర్తుడు, చోరుడు, క్రోధి, నారీలోలుడు, సోమరి, కృతఘ్నుడు, నాస్తికుడు అపఖ్యాతి పొందుతారు. గురువృద్ధజనులను సేవించేవారికి బల యశస్సులు సిద్ధిస్తాయి. క్లేశాలవల్ల ధర్మోల్లంఘనంవల్ల అవమానంవల్ల లభించే ధనాన్ని వాంఛించకూడదు. విద్యాహీనుడు, ప్రజోత్పత్తిలేని రతి, తిండిలేని ప్రజలు, రాజులేని రాజ్యము అనర్థకాలే. అధికప్రయాణమే దేహధారికి ముసలితనం. అతివృష్టి పర్వతానికివార్ధక్యం

మిస్తుంది. కామభోగవంచితురాలికి అదే వార్ధక్య కారణం. వాగ్బాణాఘాతాలే మనోవార్ధక్యం. సతతాధ్యయనశూన్యత్వమువల్ల వేదము, వ్రతనియమ రాహిత్యంవల్ల బ్రాహ్మణత్వము, బాహ్లీకదేశంవల్ల పృధివి, అసత్యపరాయణతవల్ల పురుషుడు, క్రీడా పరిహాసాలవల్ల పాతివ్రత్యమూ, ప్రవాసంవల్ల స్త్రీ మలినులౌతారు. సువర్ణంనుండి వెలువడే మాలిన్యమే రజితం. దానినుండి రాగి, దానినుండి సీసం.

మహారాజా! దీర్ఘకాలం నిద్రిస్తూ నిద్రనుజయించలేము. కామభోగాలు సాగిస్తూ స్త్రీలను జయించలేము. అధికంగా త్రాగుతూ మద్యాన్ని జయించలేము. ధన దాన్యాలతో మిత్రులు, అన్నపానాలతో స్త్రీలు, విజయంతో శత్రువులు వశీభూతులు కావాలి. మీరు లోభాన్ని విడిచిపెట్టండి. ఈ భూమండలంలోని ధన ధాన్య కామినీ కాంచన పశుసంపద అన్నీ లభించినా ఒక్కొక్కడు తృప్తిపడలేడు. అది మనిషి యొక్క స్వభావంలో ఉంటుంది, మరొకసారి తమకు నివేదిస్తున్నాను. దుర్యోధనాధులతో ధర్మ రాజాదులనుకూడా సమదృష్టితో చూడండి. అని విదురుడు తన బోధయింకా కొనసాగిస్తున్నాడు.

మహారాజా! ఉత్తమపురుష సాంగత్యంతో అనాసక్తచిత్తంతో యథాశక్తిగా కృషిచేసేవాడు కూడా అర్థం సాధించగలడు. అటువంటివాడు విశాలయశస్సు సాధిస్తాడు. వాడు సర్వసుఖాలు పొందుతాడు. అధర్మమార్గాన వచ్చి పడే ధనరాసులను కాలదన్నేవాడు పాము కుబుసాన్ని విడిచినట్లు దుఃఖాన్ని విడుస్తాడు. అసత్యంతో ఔన్నత్యాన్నీ, మోసంతో రాజునూ, దోషారోపణతో గురువులనూ, అగ్రహపాత్రులుగా చేసుకొనేవాడు బ్రహ్మహత్యాసదృశపాతకుడవుతాడు. గుణాలలో దోషారోపణ చెయ్యడంకంటె మృత్యువులేదు. పరనిందయే లక్ష్మీతిరస్కారం, ఆత్మస్తుతి, సేవారాహిత్యం, అనాలోచిత కార్యయత్నము, ఇవి విద్యాశత్రువులు. సోమరితనము మదము మోహము చంచలత్వము నిరంతరగోష్ఠి ఉద్దండత స్వార్థము ఇవి విద్యార్థులకు పనికిరానివి. సుఖాన్ని వాంఛిస్తూ విద్యను అధ్యయనం చేద్దామంటే అది సాగదు. సుఖాన్ని విడిచిపెట్టాలి. ఇంధనాలు అగ్నికి నదులు సముద్రానికీ ప్రాణులు మృత్యువుకూ పురుషుడు కుల్టకూ తృప్తి కలిగించలేరు. ఆశ ధైర్యాన్నీ, యముడు

సమృద్ధినీ, క్రోధం లక్ష్మినీ, దైన్యం యశస్సునూ సారహీనాలు పశువునూ నశింపచేస్తాయి,

మహారాజా! కుపితుడైన విప్రుడు రాష్ట్రాన్ని నాశనం చెయ్యగలడు.

కౌరవేశ్వరా! కాంస్యపాత్రలు, రజితము, మధువు, ధనుస్సు, పక్షి, వేదవిదులైన విప్రులు, వృద్ధులైన కుటుంబజనులు, మేకలు, విపత్తులలో పడ్డ కులీనులు సర్వదా ఆశ్రయణీయులు. అతిథి దేవతా పూజలకొరకు వృషభ చందన వీణావాద్యాలు ఆజ్య మకరంద జల శంఖ సాలగ్రామ గోరోచన దర్పణ కాంస్యపాత్రలు (రాగిచెంబులు) సిద్ధంగా ఇంట్లో ఉండాలి. ఇప్పుడు మరొక ముఖ్య విషయం చెబుతున్నాను; సావధాన చిత్తంతో విను. కామ, లోభ, భయావృతుడై ధర్మాన్ని విడిచిపెట్టి జీవితాన్ని సాగించడానికి ప్రయత్నించకూడదు. ధర్మమే నిత్యమైనది; సనాతనమైనది. సుఖదుఃఖాలు అశాశ్వతాలు. జీవుడు నిత్యుడు. కాని జీవకారణం ఉన్నవే అది అనిత్యము. అందుచేత దానిని విడిచి నిత్యవిషయాలలో బుద్ధిని లగ్నంచెయ్యాలి. అదే ఆనందహేతువు. ధనధాన్య సంపన్నమైన భూమండ

లాన్ని శాసించిన రాజులు సయితం నిష్క్రమణ వేళ తమ వెంట గడ్డిపోచగూడా కొనిపోలేరు. ఎంత టి బలవంతుడైనా ఈ భోగభాగ్యాలను ఇక్కడ విడిచి పోవలసిందే. ఈ విషయం మీ రెరిగినదే. అయినా ఒక్కసారి స్మరణకు తేవడం నా విధి కష్టపడి పెంచి పోషించి రక్షించిన కుమారుడు ఆ తండ్రి మరణిస్తే తన చేతులతో తనే శవాన్ని ఇంటి వెలుపల ఉంచుతున్నాడు. అప్పటిమట్టుకు కొంతసేపు ఏడుస్తాడు. తరువాయి ఈదేహాన్ని ఎండు కట్టెలను దగ్ధంచేసినట్లు భస్మం చేస్తున్నాడు. మర ణించిన మానవుని ధనధాన్యాలను ఇతరు లనుభ విస్తున్నారు, శరీరధాతువులను పశుపక్ష్యాదులు గ్రహి స్తున్నాయి. మానవుడు చేసిన పుణ్య పాప కర్మల ఫల మే వానివెంట పరలోకానికి వస్తోంది. ఫలపుష్పాలు లేని చెట్లను పక్షులు విడిచి పెట్టేటట్లు మృతదేహాన్ని దారా పుత్ర జ్ఞాతులందరూ విడిచి పెడుతున్నారు. అగ్నిదగ్ధుడైన పురుషుని వెంట మంచిచెడ్డల కర్మ ఫలమే వస్తోంది. అందుచేత మానవుడు ధర్మమా ర్గాన చరించాలి. ఈ సర్వప్రపంచంలో అజ్ఞానాంధ కారం వ్యాపించి ఉంది. అది ఇంద్రియాలను మో

హంలో ముంచుతుంది. దానిని గుర్తించి మీరు దూరంగా ఉండాలి. నామాటలు మీరు విశ్వసించ గలిగితే భయరహితులై ఇహపరాలలో సుఖశాంతులు పొందగలరు. ప్రభూ! మానవజీవితం ఒక నదీ ప్రవాహం. సత్యస్వరూపుడైన పరమేశ్వరునుండి ఇది ప్రభవించింది. ధైర్యమే దీనికి ఒడ్డు. దయయే తరంగాలు. పుణ్యకర్ములే ఈనదీస్నానం చేసి తరించ గలరు. లోభశూన్యమైనఆత్మఎప్పుడూపవిత్రమైనదే. పంచేంద్రియ రూపమైన జలాలతో కామక్రోధాది మకరాలతో ఉన్న జనన మరణ రూప సంసార సాగరాన్ని ధైర్య నౌకతో దాటాలి. బుద్ధీ, ధర్మమూ, విద్యా, వయస్సులలో పెద్దలైనవారికి ఆదరసత్కా రాలు జరిపి ప్రసన్నులను చేసుకొంటే వారు సన్మార్గ ముపదేశిస్తారు. దానితో మానవుడు మోహంలో పడ డు. క్షుత్తునూ, కామాన్నీ జాగ్రత్తగా రక్షించుకో వాలి. అంటే సహనశక్తి అవసరం. కర, పాద, నేత్ర, మనోవాక్కులను సత్కర్మలతో రక్షించాలి. స్నాన సంధ్యాధ్యనుష్ఠానాలూ జపతపాలూ స్వాధ్యా యమూ జలతర్పణాలూ పతిత జనరక్షణా గురు సేవా తత్పరతా సత్యవ్రతమూ కల బ్రాహ్మణుడు

బ్రహ్మలోకంలో శాశ్వతంగా ఉంటాడు. వేదాధ్య యనంతో అగ్నికార్యంతో హవిర్భాగ సమర్పణతో ప్రజారక్షణ తత్పరుడై గో, బ్రాహ్మణులను కాపాడుతూ యుద్ధభూమిలో మరణించినవాడు ముల్లోకాలూ పొందుతాడు. వేదశాస్త్రాలధ్యయనం చేసి క్షత్రియులకూ ఆశ్రితులకూ సమయానుసారం సహకరిస్తూ గార్హపత్య అహవనీయ దక్షిణాగ్నులను యజ్ఞాలతో సేవిస్తూ పవిత్ర ధూమ గంధాలను ఆఘ్రాణిస్తూ జీవించే వైశ్యుడు స్వర్గసుఖాలు పొందుతాడు.

బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులను ఉచిత రీతిని సేవిస్తూ మనోవ్యథా రహితుడై పాపదూరుడైన శూద్రుడు స్వర్గం చేరతాడు.

మహారాజా! వర్ణధర్మాలు నీకు చెప్పాను. కారణ మేమంటే మీ వల్ల ధర్మరాజు క్షత్రియ ధర్మచ్యుతుడయ్యాడు. అది జరుగకూడదు. అందుచేత మీరు వానిని క్షాత్రధర్మం మీద నిలబెట్టాలి. అది మీ కర్తవ్యం- అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు- మహామంత్రీ! నువ్వు సత్యమే చెప్పావు.

నా అభిప్రాయంకూడా అదే. కాని దుర్యోధనునివల్ల నా బుద్ధి స్థిరంగా ఉండడంలేదు. ప్రారబ్ధాన్ని దాటడానికి ప్రాణికి శక్తి లేదు. అందుచేత ప్రారబ్ధం ముందు పురుషకారం వ్యర్థమని నేను భావిస్తున్నాను–" అన్నాడు.



